శ్రీ బా. భా. గ్రం. [illegible]     అనుబంధగ్రంథమాల నెం. 4

# శ్రీకన్యకాంబాసీసశతకము.

గ్రంథకర్త

నా. గా. వేంకటసుబ్బయ్యశాస్త్రి.

ప్రొద్దుటూరు.

ప్రకాశకులు

రామసుబ్బయ్యశాస్త్రి, ప్రెసిడెంటు.

శ్రీ బాలభారతీగ్రంథనిలయము, చాగలమఱ్ఱి.

ప్రొద్దుటూరు.

శ్రీ జానకీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము

మొదటికూర్పు 1000

1925

సర్వస్వామ్యసంకలితము.     వెల. 0-4-0

ప్రథమరత్నము

# సువర్ణకేసరి కృష్ణసేన (సాంఘికనవల)

ఆంధ్రభాషయం దక్షరజ్ఞానముగల ప్రతిమానవుడును చదువతగిన యద్భుతకథ. సువర్ణకేసరికయి చంపకమాలయును, కృష్ణసేనునకై చంద్రమల్లుడును, పన్నెడి యుపాయములను, పడెడిపాట్లను, సమర్థించెడి సాహస కార్యములును, తుట్టతుదను సువర్ణకేసరీ కృష్ణసేనుల సమాగమమును, సాంతముగా చదివినవారల హృదయము పొంగి మేను పులకరించి ఆనందభాష్పముల విడువకమానరు. సందర్భానుసారముగా పెక్కు సాంఘికవిషయములు చర్చింపబడినవి. వెయ్యేల. చదువ మొదలిడిన అంత్యముగువరకు విడువను మనసుపుట్టదు.

| | |
|---|---|
| వెల చందాదారులకు | 0—12—0 |
| యితరులకు | 1— 0—0 |

ద్వితీయరత్నము

# కలియుగదర్పణము (నాటకము)

కలిపాతనిరసనము! కులపిదార ఖండనశాసనము!

వృద్ధవివాహములు- అతిబాల్య వివాహములు- కలియుగానర్థములనియు- యువజన కంటకములనియు ప్రదర్శించుటకు "కలియుగ దర్పణమే"! దర్పణము. బాలవితంతువగు సుమతి దుఃఖమును చదివిన నెంతటి రాతిగుండెయైనను కరగకమానదు, ఇందలి పద్యములు రసవంతములు. మోహవార్ధిని మునింగిన జనార్ధనుడు ముక్తిమార్గమును చూపును వ్యభిచారి-విరాగియగును. నీతిబాహ్యుడు-నీతిబోధకుడగును. ఇది దుండగీడులను సమ్మెటపోటు. దుష్టయవ్వన విద్యార్థులకు వివేకబోధిని వేశ్యాహ్యపాఠాటవికి దావానలము. వెయ్యేల చదివిచూచిన హృదయము రంజిల్లును.

| | |
|---|---|
| వెల చందాదారులకు | రు 0-12-0 |
| యితరులకు | 1-0 -0 |

గ్రంథములు వలయువారు:—

**శ్రీ బాలభారతీగ్రంథనిలయము.**

చాగలమఱ్ఱి అనివానిన బడయగలరు.

శ్రీబాలభారతీగ్రంథనిలయము. అనుబంధగ్రంథమాల నెం. 4

# శ్రీ కన్యకాంబాసీసశతకము.

గ్రంథకర్త

నామా వేంకటసుబ్బయ్యశ్రేష్ఠి



ప్రకాశకులు

ఎం. రామసుబ్బయ్యశ్రేష్ఠి

ప్రెసిడెంటు

శ్రీ బాలభారతీగ్రంథనిలయము.

నాగలమర్రి

ప్రింటర్సు

శ్రీ జానకీ ముద్రాక్షరశాల,

ప్రొద్దుటూరు.

**1925**

గ్రంథస్వామ్యసంకలితము.

# విద్యాగురుస్తుతి.

క. మామిళ్లపల్లె గంగా
గ్రామణి యనుశేషశాస్త్రి ॥ కరుణాకరుఁడై వి
ద్యామర్మంబులఁ దెలిపెను
ఆమహితుని నంతరంగ ॥ మందుఁ దలంతున్.

క. మోదంబలరఁగ విద్యా
ప్రాదేశిక మొసఁగి కొంత ॥ పద్యాదిమతా
రాదుల నేర్పిన మద్గురు
వేదార్థము రామవిబుధు ॥ వినుతు లొనర్తున్.

# విజ్ఞాపన.

క॥ ఇలఁ గల మానుష శేముషి
కలుగుట పొరపాట్లు సహజ ♦ మగు, బుధులారా!
జలఁగడిగి పసిఁడిఁ గొను సర
సులవలె సుగుణములఁ గొనఁగ ♦ స్తుతియింతు మిమున్॥

క॥ బాలుఁడ, ప్రమాదము లరయఁ
జాలను నీశతక మందు ♦ సవరణ లున్నన్
బాలం ద్రావి, జలము విడఁ
జాలెడు రాయంచ మాడ్కి ♦ క్షమియింపఁ దగున్॥

మ-రా-రా-శ్రీ,

నాయనా వేంకటసుబ్బయ్య శాస్త్రిగారి, సన్నిధికి పానుగంటి. లక్ష్మీనరసింహారావు అనే కాశీర్వాదపూర్వకముగ వ్రాసినది:—

మిగుల దయతో మీరు పంపిన శతకద్వయమును కృతజ్ఞతతో నందుకొంటిని. వెంటనే రెండు శతకములనుగూడఁ జదివితిని. మీ కవిత్వము మృదులముగాను, సుందరముగా నున్నది. అనేక పద్యములు భక్తిరసపరిపూర్ణములై విరాజిల్లుచున్నవి. బాల్యమునందే మీకిట్టి కవితాధోరణియు నిట్టి భక్తియు గలుగుట సంతోషజనకమై యున్నది. ఇంకను బెక్కు గ్రంథములు మీరురచియించి భాషాదేవి నలంకరింతురని నమ్ముచున్నాను.

చిత్తగింపుడు,
పానుగంటి లక్ష్మీనరసింహారావు,
పిఠాపురము.

ఆర్య!

తమరు దయతోఁ బంపిన శతకములఁజూచితిని కవిత్వము ధారాళమై లలితపదభూయిష్ఠమై యొప్పుచు పండితపామరరంజకముగానున్నది. ఇంత చిన్నవయస్సున నారంభముననే యిట్టిచక్కని కవిత వ్యాపారలోలురగు వైశ్యవంశమునఁబుట్టిన యొక్క యువకుని కీకాలమున సాధ్యమగునే యని యచ్చెరువు గలిగించునంతటి యొప్పిదములై యున్న మీ పంపిన శతకములు చిరకాలము వెలయగలవు.

విధేయుడు,
మం. వేంకటశర్మ. తణుకు

# సం వి ష య ము.



సజ్జనులారా!

శ్రీ చంద్రమౌళీశ్వర చెన్నకేశవ శతక ద్వయంబును, రచియించి యచ్చువేయించిన నాటంగోలె ఆంధ్రవాల్మీకిబిరుదాంకితులగు బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావుగారు తొలి నుండి యందు పొందుపరచిన యాశయంబునుం దలంచుకొనుచు నెయ్యదియో యొక యుద్గ్రంథమును లిఖించి యాంధ్రభాషా యోషామణి నలంకరింపవలెననుం గుతూహలంబు బెన్నై స్వాంతంబున నుత్తేజితంబగుచు నందని మ్రాని పండ్లకొఱకుం బ్రాఁకులాఁడు పొట్టివానివలె నపహాస భాజనంబగుదునని యత్నంబునవదలి యోజనాయత్తమానసుండనై, మనఃకౌశలంబు పిసికియుండు తఱిం, బ్రవాహంబుపైం, బ్రవాహంబు పడినట్లు కుటుంబ విషయకమైనయిక్కట్లు పెక్కుంబెక్కులు హాటిల్లుటచే నేమియు దిక్కు తోఁపక విచారగ్రస్తుండనై, నిర్విణ్ణుండనై, కవితావిషయకమైన నడకలయందాసక్తి నుపశమిల్లితిని నా గోడపలన్నియు నప్పుడప్పుడు పరిశీలించుచున్న మిత్రులలోఁ మ-రా-రా-శ్రీ శ్రీయుత కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠి గారును, నిచ్చెనమెట్ల సుబ్బయ్యశ్రేష్ఠిగారును; జూటూరు శరభయ్య శ్రేష్ఠి గారును కేవలపారమార్థికులై, యస్మదీయ సంసార

వ్యత్యాస సాగరంబునకు జెలియలి కట్టలై, తగుపాటి బుద్ధులఁ గఱపుచు నన్నెంతయుఁ బ్రోత్సాహిఁ జేయు పొంచె నుంకించుచు దైవబలమెప్పుడుఁ గలుగునో యని వేచియుండుటయేఁ గాక నెమ్మనంబునకు నెమ్మది క్రమ్మఁ జేసిరి. అట్టి సకాలమున గుఱించి నా నెయ్యంపు నెచ్చెలికాండ్రు కొందఱు శ్రీయుత తల్లం సూరయ్యశ్రేష్ఠి గారును, మునగా ఓబుళమయ్య శ్రేష్ఠి గారును, "నేదియో యొక చిన్నిస్తోత్రంబును వ్రాయు" మనియు "నేర్చిన విద్య యడుగంట నిచ్చుట చెంగటి రత్నంబుఁ బోనాడు కొన్న"ట్లనియు గుణాగుణములరయుటయం దుత్తీర్ణుఁడవై, యట్లుండుట బుద్ధిమంతుని, లక్షణంబుగా"దనియుఁ బరిపరివిధములుగాఁ బ్రోత్సహించుచు గ్రంథరచనకుగడంగునట్లు నన్నాయత్తపరచు నంతటి నీతులఁ గఱపుచు మనస్తురంగమునకుఁ గళ్లెంబును, గమనమునకు 'లగాము'నయి యిట్టట్టులఁ గదలనీయక చిక్కఁబట్ట నుద్యమించిరి. వారి యనుమతిని మీరఁజాలక యెట్టకేలకు "హనుమత్పంచవింశతి"ని వ్రాసి ముద్రిణ సహావేయించితిని. కాని యంతటితోఁ దృప్తినొందక మదీయ కులాధి దేవతయగు కన్యకాంబానామాంకితంబైన శతకమొండును లేదని తలంచి కొలఁది దినములలో ముగింప నుద్యుక్తుఁడనైతిని. నా యుద్దేశ రథంబునకుఁ జోదకుని వలె శ్రీయుత ఎం. రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు తమచిరకాల మైత్రిని వెల్లడిచేయుటకో మఱేటికో కాని యొకానొక ప్రస్తావన సందర్భమున "కులదేవత నుద్దేశించి సీసపద్య శతక మొక్కటి వ్రాయుము దానిని నా గ్రంథనిలయమున మూడవకు

యనుబంధముగాఁ దీసికొనియవచ్ఛ్రించెద"నని నుడివితి. తక్రీ
య వాక్యసరణి యథాతగాఁ గాని సత్వరితముగా వ్రాసి వా
రికిఁ దెలియఁ జేసితిని. ఈ తెలివిడిఁ బరికించి తద్గ్రంథమును నీన
వరాత్రములలో 1925వ సంవత్సరము సెప్టెంబరు నెల 19 వ తేదికి
సరియైన క్రోధననామసంవత్సరాశ్వయుజ శు ౧ ల నాటికి
ముద్రణము ముగించుటకై జానకీముద్రణాలయమునందు నొ
సంగిరి. ఇందు కొన్ని సవరణలొనరించుటకు నవకాశము చాల
మియు, నియమిత కాలమునకు నచ్చొత్తించుట సమాప్తినొం
దింపవలయునను తొందరలవలనను గొన్ని ప్రమాదములుండు
నని యూహించెద. సుధీమణులైన వారలు హంసక్షీరన్యాయం
బున గుణగ్రహణపరాయణులు గాదురని నా వినయపూర్వక ప్రా
ర్థన. నన్నెంతయుఁ బ్రోత్సహించి గ్రంథరచనకుఁ గడంగునట్లొ
నర్చిన నా సంగడికాంధ్రకెల్లరకుఁ గృతజ్ఞుండ. ఇందలి పద్యంబు
లుకొన్ని, దేవీసంబంధ చరిత్రాత్మకములు గాన నవ్యతరోత్స
వాద్యలంకార నిరూపణములయందు నుత్సాహ తరంగిత స
ముద్ర స్వాంతులై ఖడ్గంబుఁగొని ముఖాముఖి నిలువంబడిచదువ
నుపయోగింపవచ్చును. మఱికొన్ని, దేవ్యలంకారనివర్ణనా ప
తాఁరవర్ణనలు గాన, నత్యుగ్ర మహాపాతక భూభృద్వజ్రాయు
ధంబులై, మోక్షసాధనములై, లోకోత్తరములుగానుండును.
వేరొకకొన్ని, భక్తిరసప్రధానములై, నీతిదాయకములు కాన,
పారాయణార్హములై, సర్వజన ప్రబోధితములై పాఠకజన
హృదయాకర్షణములై, శ్రోతలకు శ్రవణపర్వములుగానుం
డును. ఇంకొక కొన్ని దుష్టచర్యానుగుణ్యాజనవర్తన ఖండశా

సనములు కాన, కలియుగానుసారములుగానుండును. ఇందలి విశేష విషయంబుల వేరువేరుగా సక్కాణించుట అస్సలుకన్న పడ్డిమిన్నయానను సామెత ననుసరించునను గ్రంథబాహుళ్య భీతుడనై యింతటితో మిన్నకుండుట చదువరులు మన్నింతురు గాత,

ఇట్లు,

సుకవిశ్రేయుండు.

నామా వేంకటసుబ్బయ్య శ్రేష్ఠి

ప్రొద్దటూరు. (కడపజిల్లా)

19—9—25



## శ్రీ బాలభారతీగ్రంథనిలయప్రకాశాకర వర్ణనీయపద్యరత్నావ

.——o——

శ్రీయొప్పఁ జన్నారి ♦ ప్రాయంబులో మెప్పఁ
బాటించు సత్కవీ ♦ శ్వరుల వలన
లలిత సద్రసవదా ♦ లంకార భూయిష్ఠ
భావమ్ము, వర్ణనం ♦ బవల నెగడె
రజితమందార శ ♦ రచ్చంద్రికాఽమృతాఽ
శ్రితదీధితులఁగీ ♦ ర్తిని నెదిర్చెఁ
గ్రమతలోకోత్తర ♦ ఘనత నాపన్నబా
ంధవతారకాఽబ్జమై ♦ తనరుగాఁత
నిలను బాలభారతీగ్రంథ ♦ నిలయమనఁ, జె
లంగెఁ జాగలమటి గ్రామ ♦ మంగునూరి
యఖిల బుధసన్నుతాఽఖ్యతో ♦ నాదరించు
ముఖ్య కవితాప్రదర్శన ♦ ములఁ గడంగి,

గీ॥ బాలభారతీ గ్రంథ స ♦ మాలయమున
కార్య సమ్మతమూనె, స ♦ ధ్యక్ష పదవి
మంచి పసిఁడిలోఁ బొదవిన ♦ మణిసిఁబోలి
రామసుబ్బయ్య శెట్టి, వ ♦ రాలపుట్టి,

# మనవి.



పాఠకమహాశయులారా!

ఈ గ్రంథకర్తయగు శ్రీయుత నాసా వేంకట సుబ్బయ్యశాస్త్రిగారు నా బాల్యమిత్రులు. వీరు బాల్యమాదిగా కవనమందు నాసక్తికలిగి తన చేనైనంతవరకు భాషాసేవ చేయుచున్నారు. "శతకద్వయము" (శ్రీచెన్నకేశ్వర, చంద్రమౌళీశ్వరశతకములును,) "హనుమత్పంచవింశతి" యను శతకములను సహా రచించియున్నారు. భాష చాలా సరళముగాను రసవంతముగానున్నది,

వీరు తమచే రచియింపబడిన శ్రీ కన్యకాంబాశతకమును నాయందలి సోదరప్రేమచే మా గ్రంథనిలయమున వెలువరింపజేయుట కిచ్చగించుటయేగాక ప్రకటనమునందలి సర్వహక్కులు మాకే యిచ్చియున్నందుల కెంతయుఁ గృతజ్ఞుల మగుచున్నాము.

శ్రీ శాస్త్రిగారు నిరంతరము భాషాసేవయు దేశసేవయు చేయుచుండులాగున భగవంతునిగూర్చి మిక్కిలి ప్రార్థిస్థా యున్నాము.

చాగలమఱ్ఱి
25—8—25

ఇట్లు,
సర్వజనవిధేయుడు.

శ్రీ లలితాపరదేవతాయైనమః



# శ్రీ కన్యకాంబా సీస శతకము

———o———

శ్రీ రుక్మిణీ పురం ♦ ధ్రీవివాహము వేళ
సిగ్గుచేఁ దలవంపు ♦ లగ్గలింప
మంజీర నాయక ♦ మణి వంకఁ జూచుచుఁ
బ్రతిబింబమునుఁ గాంచి ♦ భ్రమనువహించి
మునురామ చరణాబ్జ ♦ ముల ధూళినఁ జనించు
జవరాలి నెపముచే ♦ సవతి పోరు
కించ మించగఁ బఱి ♦ కించి సన్నికలు ద్రొ
క్కించు నప్పుడు కాలి ♦ కిటుకుతోఁడ
మానికముఁ గప్పి శంకైక ♦ మానసార్థ
పశ్యతోహరుఁ డైన శ్రీ ♦ బాలకృష్ణు
నతులితైశ్వర్య మతికింప ♦ నభినుతింతు
కలితకల్యాణ నికురుంబ ♦ కన్యకాంబ! ౧

మేనఁ దాల్చిన గాడ్పు ♦ మేపరి పేరులు
ఫణములో యున్నఁ జూపి ♦ పసువు లంఁచ
వెండి కొండ బెడంగు ♦ దండించు మెయిచాయ
వన్నియ నలువు క ♦ న్పండు వలర
వేల్పుటేన్గు మొగంబు ♦ వెల్ల పుచ్చెడు తొండ
మట్టిటు లిరుప్రక్క ♦ లల్ల లాడ
మొక్కువారల పనుల్ ♦ చక్కంబరపు పెద్ద
వెక్క ప్రేముడి జారు ♦ చూడ్కు లీన
మేనకాత్మజా స ♦ మీపము పసిపాప
మాది రాడ నేర్పు ♦ నాది దేవు
విఘ్ననాథుఁ దలఁతు ♦ విఘ్నము ల్లే మికి
ఘన సుగుణ కదంబ! ♦ కన్యకాంబ! ౨

తెలిదమ్మి గద్దెపై ♦ కొలువయ్యి మినుకుల
తొయ్యలి సల్పు మా ♦ ధుర్య మొలయ
సరసగా నా౽మృత ♦ సారంబుఁ జెవులార
దోయిలించుకొని సం ♦ తుష్టుఁ డగుచు
ప్రేయసిఁ దిలకించి ♦ ప్రియ వాక్యముల జీవ
సృష్టి కౌశలము వి ♦ చిత్ర గతులఁ
బచరించితి నన నే ♦ ధ్వనుల మీ సాటియై
లోప లేశము గూడ ♦ బాపి కొంటి
ననుచు సరస సల్లాప వా ♦ క్యముల ద్రుహిణ
హృత్కమలము వినోద ర ♦ సైక లహరి
నోల లాడించు వాణి న ♦ న్నోముగాత
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౩

పదివేసముల సామి ♦ పసఁ జిమ్ము వక్షమ్ము
నుండిరమ్మాయె నే ♦ మానవతికి
షోడశాఽమల కళా ♦ శోభాయమానుఁడౌ
శశి తోఁడఁబుట్టువే ♦ సచ్చరితకు
క్షణమాత్రమునఁ బ్రపం ♦ చము నెల్ల సృజియించు
పరమేష్ఠి పుత్రుఁడే ♦ భాగ్యవతికి
కలహంబు లేమిచే ♦ కడుపు నిండని నార
దసురర్షి మనమఁడే ♦ తరళనేత్రి
కట్టి, కల్ములనాతుక ♦ యతుల కుశల
సంపదల నిచ్చి రక్షింప ♦ సన్నుతింతు
నెపుఁ దెగని భక్తి రసమొల్కఁ ♦ దపయ కెపుడు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౪

శబ్దాఽర్థముల మాడ్కి ♦ జాయాపతుల్ మాడ్కి
కగపడక ప్రపంచ ♦ మందుఁ దిరిఁగి
ధరాత్ర దయాఽవేషు ♦ భౌతికముఖులకు
ణంబు క్రమంబు కా ♦ లంబులరసి
భూలోక మందార ♦ మునుఁ గేరునాధార
మనఁగ భక్తాంబుల ♦ త్యంత మొసఁగి
రక్షణం బొనరించి ♦ సాక్షి నేనను ప్రాంచి
తజ్ఞాన మంతరా ♦ త్మల కొసంగి
త్యక్త సర్వ క్రమ విభాగు ♦ లై తనర్చు
బితరు లర్ధనారీశు లీ ♦ ప్సితము లిచ్చి
యాయురాఽరోగ్యములఁ బ్రోవ ♦ నభినుతింతు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౫

స్వాత్మసద్గుణ వార ♦ రత్న రత్నాకరే!
దీన శుభంకరే! ♦ తేనమోస్తు
పూర్వ గీర్వాణౌఘ ♦ గర్వ నిర్వారణే.
భానుకోటిప్రభే ♦ తేనమోస్తు
యజ్ఞాన శాసనే ♦ సుజ్ఞాన భూషణే!
దివ్య సంరక్షణే! తేనమోస్తు
నారాయణీ వేద ♦ పారాయణీ స్తుతే!
దివ్యేశ్వరార్చితే ♦ తేనమోస్తు
ధ్యాన పర దాస వాసినే ♦ తేనమోస్తు
ధీర జన సమారాధనే! ♦ తేనమోస్తు
కన్యకాంబాభిధాన ప్ర ♦ కాశ నిత్య
దీప్త హైమవతీ సతీ! ♦ తేనమోస్తు! ౬

గోత్రాత్మ జేశుఁడు ♦ గోత్రాత్మ జేశుఁడు
రవి సుత త్రాణుఁడు ♦ రవి సుతారి
పుష్కర చరణుఁడు ♦ పుష్కర కేశుఁడు
మారుని తండ్రి, కు ♦ మారు తండ్రి
నాగేంద్ర వరదుఁడు ♦ నాగాజిన పటుండు
నాగేంద్ర శయనుఁడు ♦ నాగ ధరుఁడు
ద్విజ రాట్తురంగుఁడు ♦ ద్విజరాడ్వతంసుఁడు
నీలాభ్ర వర్ణుండు ♦ నీల గళుఁడు
కేశవ స్వామి చంద్రమా ♦ లీశు లెలమి
యేక పద భావులై యన్న ♦ దీప్త తార్థ
సౌఖ్యముల నిచ్చి రక్షింప ♦ సన్నుతింతు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭

దాఁటినాఁ డెవ్వఁడు ♦ దటు సంటి కాల్వగా
శత యోజన ప్రాంశు ♦ జలధి మీఁద
చాఁటినాఁ డెవ్వఁడు ♦ జయ భేరి యనురాఁగ
నా గర్భ శిశు భిన్న ♦ నాద మనఁగ
నాటినాఁ డెవ్వఁడు ♦ నళినాప్తకుల శాఖఁ
బ్రతికించి లక్ష్మణ ♦ స్వామి నాజి
మీటినాఁ డెవ్వఁడు ♦ గోటితో నక్షయ
కొమరు ప్రాణాద్రిగోల్ ♦ గుండువలెను
నట్టి సుజ్ఞాన శాలి వే ♦ దాంత మాళి
సన్మునీంద్రాబ్జ వనహేళి ♦ శాంత శీలి
మార్దవ స్వాంతు, హనుమంతు ♦ మదిని నెంతు
కలితకల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮

ఆంధ్రీకరణశక్తి ♦ యత్యుత్తమ కవిత్వ
కల్పనా శక్తి ప్ర ♦ గల్భ్య శక్తి
వైయాకరణశక్తి ♦ పాండిత్య పృథుశక్తి
సద్రసాలంకార ♦ సగుణ శక్తి
వాగ్గుంభ జృంభణ ♦ వ్యాపార చణశక్తి
భావప్రకటన ప్ర ♦ భావ శక్తి
కలిగిన ప్రాచీన ♦ కవి సార్వ భౌముల
కాధునిక కవీశ్వ ♦ రౌఘములకు
మత్కవిత్వాభి వృద్ధికై ♦ హృత్కమలము
నందు ప్రార్థన సేతు కృ ♦ తాంజలి సయి
మాన్య ధనధాన్య దా! లోక ♦ మాన్య! ధన్య!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౯

మిన్నేటి కెనయనఁ ♦ జెన్నారుఁ బెన్నేఱు
తత్తరంగిణికి యు ♦ త్తరపుఁ దట్టు
భూరమణీ కంఠ ♦ హార తరళమయి
భూలోక దేవేంద్ర ♦ పురమనంగ
పేరుపొందిన ప్రొద్దు ♦ టూరులో నర్వార్య
గీర్వాణ తతుల ర ♦ క్షింపఁ బూని
పుష్టైవ లంకార ♦ ముల కాట పట్టుగ
వంది మాగధ నుతి ♦ ధ్వాన గణము
చదలనిండు కొనఁగ విియ ♦ చ్చరులు విరుల
వాన కురియఁగ నాఁడ న ♦ ప్సరస లెల్ల
విలసి తార్చాఽవతారవై ♦ వెలసి తమ్మ!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౦

భూసతీ శ్రుతిపుట ♦ స్వర్ణ కుండలమయి
ప్రత్యక్ష దేవేంద్ర ♦ పట్టణ మనఁ
గొమరారుఁ బెనుగొండఁ ♦ గుసుమాంబకుఁ గుసుమ
సెట్టికి ముద్దుల ♦ పుట్ట వగుచు
కూఁతు మానిక మన్నఁ ♦ గొఱఁత లేని గుణాఽల
వాలవై క్రొమ్మిన్నంచు ♦ డాలు మించి
నవయువాఽలంకార ♦ భువన మోహనావ
తారవై శాంతంబుఁ ♦ దాల్చి నావు
తల్లి భక్తేప్సి తార్థమం ♦ దారవల్లి
సంతస రసాఽమృతముఁ జల్లి ♦ చాకు మన్న
మొల్ల సరులల్లి యర్పింతు ♦ ముగిది నొల్లి
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౧

శ్రీ కన్యకాంబా సీసశతకము.

మలయ మారుత ధూత • ఫలితానమ్రతరు పోత
కలకంఠ కుల గీత • కలిత మగుచు
చందన మందార • తిందుక జంబీర
మాలూర విద్రుమాన • మంద మగుచ
పరమ పరీమళో • ల్బణ బహు విధ లతా
సూన వితాన వి • స్ఫురణ మగుచు
వార సారస వార • తార గాన మయూర
శారికా కీర వి • హార మగుచు
నంద నము మించి శుభ సుఖా • నంద బృ
మొదవు నుద్యాన వనములో • నుత్సవము
మెరయు వైశ్యభ క్తేప్సితా • మరమహీజ!
కలిత కల్యాణ నికురుంబ! • కన్యకాంబ!

మోము పున్నమ చంద • మామ వెన్నెల డాలు,
బాజారు మేల్కట్లు • బాగు పరుప
మెయిచాయ వన్నియ • మెఱుపు గోడల పాలి
కపరంజి నీర్పూత • తైరహింప
వేలుపు మ్రాఁకు తీవెలఁ బోని కేల్దోయి
బడుగు పేదల కొంగు • పసిఁడి గాఁగ
నునుమించు దీగాలు • టనఁగు వ్రేళ్ల బెడంగు
కుంకుమ పుప్పొడి • సుంక మిడఁగ
నూఁట యిబ్బందు గొనియాఁడ • సాటి
చిన్ని వన్నియఁ దిఱుఁగాడు • చేత లెన
సక్కె మాన, మాబోంట్లకు • పక్క నెక్క
కదలు సామికి నెఱుకేమొ • కన్యకాంబ!

విజయార్కపుత్రుఁడు ♦ విష్ణువర్ధన రాజు
విక్రమార్కుని మించి ♦ విక్రమార్క
వర్జించి శౌర్యరూ ♦ ప క్రమాలంకార
ధగధగత్కాంతి ని ♦ దర్శనముల
పెనుగొండ కేతెంచి ♦ కని మిమ్ము నిమ్మని
యడుగ నన్నుడి కిష్ట ♦ పడకయున్న
నిర్బంధముల కూన ♦ నిజ దర్శనము నాట
యిబ్బంద్రులకు దయా ♦ దృష్టి నొసఁగి
మిత్ర బంధు కళత్ర స ♦ మేత ముగను
ధైర్య సాహస యూథులై ♦ ధర్మమరసి
హోమ కుండములో దూఁకి ♦ యురు యశస్సు
గనరే! స్వకులాభిరక్తులై ♦ కన్యకాంబ! ౧౩

హోమ కుండమునందు ♦ నొఱిగిన తదుపరి
నీవిచ్చు శాప వా ♦ జ్ఞయతి చేత
విష్ణువర్ధన మహీ ♦ విభుని సంపద్బంధు
యుక్తంబుగా నాశ ♦ మొందఁ బూని
వాని శీర్షము వేయి ♦ వ్రక్కలై ధరఁ ద్రెళ్ళ
సూర్య చంద్రాదులు ♦ సోలనైరి
దిక్కులు దద్దరిఁ ♦ దిరుఁగ సాగెను పృథ్వి
వ్యాకాశములు వణ ♦ కందు చుండ
నేమని వచింతు త్వన్మహో ♦ భూమ మహాహా
వేయి నోరులుగల సర్ప ♦ విభునికైన
పొగడ శక్యము గాఁదు మా ♦ బోంట్లకగు నె
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౪

సుంధుందక రాజన్య ♦ చూడామణి యొకండు
శత్రుల కోఁడి రా ♦ ష్ట్రంబు వీఁడి
శ్వేతాఽశ్వమును నెక్కి ♦ చింతా మనస్కుఁడై
యారణ్య మార్గ ప్ర ♦ యాణుఁ డగుచు
జను చుండ గన్గద ♦ ముని పర్ణశాలను
వీక్షించి యటఁ డగ్గి ♦ వినయ మెనయ
తన పరాభవ రీతి ♦ వినిపింప మౌని స
మ్మతి సప్త శతి మహా ♦ మంత్రములను
నుడువఁ బారాయణము భక్తి ♦ గడిపి చేయఁ
ద్వదభిధాన యాగంబు బ్రీ ♦ త్యకుదర్శ,
నమునఁ గామ్యార్థ మీయవే! ♦ సముచితముగ
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౬

స్వకుటుంబ జనకృత ♦ బాధల కోర్వక
వేసరి యారణ్య ♦ వీథిఁ జేరి
గన్గద మౌని పుం ♦ గవ మహాఽశ్రమ మొందు
గను పట్ట నట కేగి ♦ తన పరాభ
వము, నుడువ మహర్షి ♦ వరుఁడు వెక్కసపుఁ బ్రే
మను సప్త శతి మహా ♦ మంత్రములను
నుపదేశ మీయ న ♦ య్యత్రర్వ మేరకు
నవ రాత్ర పారాయ ♦ ణంబొనర్చి
త్వదభి ధాన యజ్ఞము సేయ ♦ దర్శనంబు
నర్య కుల సమాధ్యాఖ్యుని ♦ కందఁ జేసి
యతఁడు వేఁడ మీసాయుజ్య ♦ మవఘళించు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౭

త్రోలి కబళంబుగా ♦ ధూమ్ర లోచన సహో
దరుఁడు మృత్యువు నోటి ♦ కరుఁగ నాయ
నను వార్తల విని శుం ♦ భ నిశుంభుల యనుజ్ఞ
గొని రక్త బీజుఁడు ♦ తో[illegible]క తామ్ర
లోచనుఁడైన యుద్ధ ♦ లోలుఁడై చనుదెంచి
బవరంబుఁ బూనఁ ద ♦ త్ప్రకృతిఁ దెలిసి
కాళికాఽకారంబుఁ ♦ గైకొని నాలుక
పుడమి యంతటఁ జాపి ♦ యొడిసి పట్టి
గుటుక్కు మని మ్రింగి వెతలచేఁ ♦ జిక్కు పడిన
ముజ్జగముల యుపద్రవ ♦ మును హరించి
భక్త వతులను రక్షించి ♦ పరఁగి నావు
ఘన గుణ కదంబ! జగదంబ! కన్యకాంబ! ౨౦

శుంభ, నిశుంభులకా ♦ సోకు దిట్టల మహో
ప్రోత్సాహ వార్థిలోఁ ♦ బొంగి పొరలి
చండ ప్రతాపులు ♦ చండ ముండాఽసురుల్
యుద్ధ సన్నద్ధులై ♦ యురుపడించి
యాజికి నేతెంచి ♦ యస్త్ర శస్త్ర పరంప
రాఽగ్ని శిఖలకు సై ♦ న్యములు శలభ
సమముఁ గావింప న ♦ సహ్య మొందుచు నప్డు
చాముండి యనెడు వే ♦ సంబుఁ దాల్చి
దారుణాఽయుధ బర్హికి ♦ దనుజ యుగళి
ప్రాణ ఫణులనుఁ గొనవె, యా ♦ హారముగను
వేల్పు మూఁకల యగచాట్లు ♦ విప్పుకొఱకు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౧

ప్రాఁతుకితోఁ దక్క ♦ పాలియిక యేరితోఁ
బడమికి నలువతో ♦ వరము లంది
చండ ముండుల దండు ♦ మిండలగా, రక్త
బీజ ధూమ్రాక్షు గాం ♦ భీర్య యుతుల
భట సచివులగ శుం ♦ భ, నిశుంభ కోణపుల్
స్వర్గంబు గొని దివి ♦ షదుల దఱుమ
మాంపాహి యంచు యు ♦ ష్మద్రిక్షి శాసించి
మొఱలిడ యవతార ♦ ములు ధరించి
బాహు బల పరాక్రమ ధైర్య ♦ సాహసముల
సింహ తురగస్థ దైత్యుల ♦ సంహరించి
నాక మెప్పటిలీలాసన ♦ నంబు నల్ప
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౦

మహిషాసురుఁడు తపో ♦ మహిమచే వాణీశు
మెప్పించి చేడెతోఁ ♦ దప్ప మరణ
మెవరితోఁ జెడని ది ♦ వ్య వరముల్ గొని వేల్పు
దొరల నోర్చి దివిష ♦ త్పుర హరణము
గావింప నిను వేఁడ ♦ గా, సురల్ బ్రహ్మ వి
ష్ణ్వభ్రకేశాదితే ♦ యాదిఘనుల
తేజస్సుతోఁ గల్గి ♦ త్రిశర దశ భుజస్థ
వారి యాయుధములే ♦ పట్టగట్టి
పోరు సేయ ననేకావ ♦ తార గతుల
నసురుఁడు, వహింపఁదదుపసం ♦ హార విధులఁ
దాల్చి వాని దున్ని, యమర ♦ త్రాసముడుపు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౧

శీత వర్షముల్ మహో ♦ ష్ణముచే సర్వ
జీవౌఘమాకటి ♦ చేఁ గలంగి
పరితాప మొందుచుఁ ♦ బ్రార్థింపఁ దత్క్ష
ణము ప్రాణి రోమ కూ ♦ పముల నుంచి
సకలౌషధీ విశే ♦ షంబులఁ బుట్టించి
తన్మూలమున బ్రోచి ♦ తతులకతుల
తృష్ణాహరామృత ♦ వృష్టిగావింపవే!
శాకంభరి యను వే ♦ సము వహించి
నిఖిల భూత దయాపేక్ష ♦ ణీ! సనంద
నాది ముని జనాదరణీ! స ♦ ర్వాభవేశి!
వినుత రుద్రాణి! వికసిత ♦ వనజ పాణి!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౨

దాడిమీ సుమ కాంతిఁ ♦ దఱుము నెత్తుటి శరీ
రంబులు రక్త దం ♦ తంబులొదవి
బహు రౌద్ర రస ముట్టి ♦ పడగ నుద్భవ మొందు
నైప్రచిత్రాసురుల్ ♦ వాఁడి మిగిలి
ముల్లోకముల నల్ల ♦ కల్లోలముగఁ జేయఁ
గుయ్యిడి రందఱా ♦ కోణపులను
జంపఁగా, లోహిత ♦ చ్ఛాయాంగముల రక్త
దంతికాఖ్యన నవ ♦ తార మెత్తి
యప్పొలసు డింక్తఁ దునిమితూ ♦ టాఁడినప్డు
మ్రోయవే! దేవదుందుభుల్ ♦ పుష్పవృష్టి
గురియరే! వియచ్చరులు, న ♦ చ్చరులు నృత్య
గానముల, సల్పఁ బూనరే! ♦ కన్యకాంబ! ౨౩

దుర్మార్గ వర్తియౌ ♦ దుర్గమాఽహ్వయమౌను
రాకాసి మేటి ప ♦ రాకు మెఱయఁ
త్రైలోక్య కంటకుఁ ♦ డై, లావు చేసిక్కి
సుర మౌని నర వర ♦ స్తోమములను
నిడుములఁ గుడిపింపఁ ♦ బస లేఁక నిను వేఁడ
నష్టా దశ కరంబు ♦ లాయుధంబు
లన్నియు ధరియించి ♦ హర్యక్ష మును నెక్కి
దుర్గాఽవతారము ♦ ధురతఁ దాల్చి
వేల్పు గొంగ నోంచ్చి ♦ వింధ్యాఽచలంబున
దాస రక్షణాఽర్థ ♦ మై మనఁగ
కొల్వుఁ దీరి నావు ♦ కువలయ సుర శాఖి!
ఘన సుగుణ కదంబ! కన్యకాంబ! ౨౫

మానిసి మెక్కురల్ ♦ మంచు కొండన నుండి
దుండగీడు తనంబు ♦ దుడుకుఁ జెంద
మౌని వర్యులఁ బెట్టు ♦ రానట్టి కడుగడ
గంట్లఁ బెట్టుచు నిక్కఁ, ♦ గావుమనుచు
వారొనర్పఁదమకై ♦ వారంబుఁ, దదృక్ష
ణాఽర్థంబు లోక భ ♦ యాపకముగ
భీమేశ్వరీ నాద్రి ♦ వేషంబుఁ గైకొని
సోకు మూఁకల నెల్ల ♦ స్రుక్కఁ జేసి
ముని వరేణ్యుల సంతసాఽం ♦ భోధియందు
నాఁటి తేరిన వారిగ ♦ నవఘళించు
తుహిన గిరి ధామ్ని! ముఖ జిత ♦ తుహినకిరణ!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౬

అరుణాసురుండు మ ♦ హాటోపమున్నతి
పాటవం బెగ దొట్టు ♦ మేటి యగుచు
సర్వుల బాధింపఁ ♦ జలమూని సందఱు
వాడిదు వెతలకో ♦ ర్వంగ లేక
భక్తి రసంబు ను ♦ ప్పొంగి మొఱలిడ
త్రైలోక్యవిహిత మా ♦ ర్గం దలంచి
భ్రమరావతారము ♦ ర్వడిఁ దాల్చి విగతాయు
వునఁ జేయవే! పోలిఁ ♦ దినెడు వాని
నీదు భక్త వాత్సల్య మె ♦ న్నికలు సేయ
నగునె! మాబోంట్ల కెందేని ♦ హరిహరాజ
సంయముల కచ్చెరువగు శ్రీ ♦ శైల ధామి!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౬

భండాసురుఁడు పెట్టు ♦ బాధల కోర్వక
యనిమేష గణము జీ ♦ కాకుపడుచు
పద్మాటవీ కదం ♦ బ, వనంబులో నున్న
తఱి, రక్కసిఁ ద్రుంపు ♦ కొఱకు నాత్మ
నతుకుఁ గుయ్యిడ ♦ నాయజ్ఞంబున సర్వ
సైన్య సమావృతా ♦ శాల వగుచు
హరి దశాకారము ♦ లవతరింపఁగ గోళ్ల
బాలావతారవై ♦ పాశుపతము
చేత సోఁకు దండుల దగ్ధ ♦ చేతనులుగఁ
జేసి, కామేశ్వరాస్త్రంబు ♦ చే వధించి
భండపుత్రు శిరంబు న ♦ స్వప్న వరులఁ
గాంచి, బ్రోవవే! జగదంబ! ♦ కన్యకాంబ! ౨౭

కాంచన కోటీర ♦ ఘటిత నానా రత్న
ధగ ధగ త్కాంతులు ♦ గగన మెగయ
బహుచిత్ర మాణిక్య ♦ భర్మ యుక్తాటంక
నిగనిగ ద్రుచి బయల్, ♦ నెగడు కొనఁగ
నరుణ పల్లవ హస్త ♦ హాటక కంకణ
ఝణఝణ త్కారముల్, ♦ సందడింప
చరణాబ్జ యుగ హీర ♦ సహిత సన్మంజీర
ధళధళ త్కాంతులు ♦ దళ్కు గుల్క
సార శృంగార చారు వి ♦ స్తార మహిమ
నమరి నావన్న! నినుగాని ♦ యాఁడజాల
నూట యిబ్బండ్రఁ దనువు సం ♦ తోషమొసఁగ
కలిత కల్యాణ నికురుంబ! కన్యకాంబ! ౨౫

అమిత సంప ద్భోగ ♦ సముదాయ మొసఁగిన
వేడ్క ప్రేముడి క్రాలు ♦ చూడ్కు లెప్డు
శరణాగత చకోర ♦ సంపూర్ణ చంద్రికా
సమ మగు మంద హా ♦ సము నహరహము
దాసాను దాస సం ♦ త్రాణాప్త చిహ్నమౌ
బిరుదారు పాదార ♦ విందమొప్పఁగ
పదియారు వన్నియ ♦ పసిఁడి వాన గురియు
పరమగాత్ర ప్రభా ♦ స్ఫురణ మెపుడు
భక్తి రస పూర్ణ బుద్ధి తోఁ ♦ బ్రస్తుతింతుఁ
గొదవ పొడగని సంపద ♦ లొదఁగఁ జేయు
మార్య మందార వల్లి! ద ♦ యా మతల్లి!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౬

అందమై, నతభక్త ♦ బృందమై, సచ్చిదా
నందమై, సద్గుణా ♦ స్పంద మగుచు
హృద్యమై, బుధరాజ ♦ వేద్యమై, సుకృత సం
పాద్యమై, యఘపఙ్క్తి ♦ పాద్య మగుచు
దివ్యమై, దివ్యప ♦ క్తవ్యమై, వేద శ్రో
తవ్యమై, విశ్రుత ♦ ద్రవ్య మగుచు
యోగ్యమై, యచ్యుతా ♦ రోగ్యమై, సకల సౌ
భాగ్యమై, యోగి వై ♦ రాగ్య మగుచు
కంజజాండము నిండఁ గాఁ ♦ గ్రాలుచుండు
త్వన్మహా మహిమ బొగడఁ ♦ దరము గాదు
వేయు నోరులు గల సర్ప ♦ విభుని కైన
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! 30

ధీరమై, మ్లేచ్ఛ వి ♦ దారమై, వైశ్య మం
దారమై, భావుకా ♦ ధారమగుచు
సారమై కుజన ని ♦ స్సారమై, వేదాంత
సారమై, విగత సం ♦ సార మగుచు
ఘోరమై, లోకోప ♦ కారమై, మహా దలం
కారమై, సరసాధి ♦ కార మగుచు
స్ఫారమై, కీర్తి వి ♦ స్తారమై, విద్యాప్ర
చారమై బుధ జనా ♦ చార మగుచు
వెలయు చుండిన మాహాత్మ్య ♦ విపుల శక్తి
గలిగి భక్త వాత్సల్య ని ♦ కాయ్య మైన
తావకీనమనోవృత్తిఁ ♦ దలఁపనగునె
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! 31

ఐరావతోచ్ఛైశ్శ్రీ ♦ పాఽజ్జాఽబ్జ విమలాఽబ్జ
కల్ప కంబుల కాంతిఁ ♦ గనలఁ జేసి
తార తార శతార ♦ తార భూభృత్తైన
హంసాఽవతంసాళి ♦ నవ హసించి
శారద నారద ♦ శారదా నారద
పారద వారంబుఁ ♦ బాఱఁదోలి
ఘన సార ఘనసార ♦ కౌముదీ కాసుగో
కుంద బృందంబుఁ బై ♦ కోఁత కోసి
పరిష విస్తాప త్వన్మహో ♦ పాండుర యశ
మనన్యశంబుగ త్రిపర్ణంబు ♦ మాపరింపఁ
జేసి నాపన్న! భక్తుల ♦ చేతి సొమ్ము!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! 32

చంద్ర సూర్యుల కిరణాఽ ♦ చార వస్తులఁ జేసి
పవలు రాత్రులు నప ♦ ంగ నెవత్తె
హరి హరాఽజుల కగ ♦ మ్యముగ సూక్ష్మ స్థూల
ముల నొక్క లీలను సం ♦ ఖిల నెవత్తె
యఖిల జీవుల నాఁటు ♦ లాడించు మాయను
కయి బొమ్మ వలెఁ ద్రిప్ప ♦ గా నెవత్తె
ప్రాత పిందె చిగుళ్లఁ ♦ బూయుఁగ మాత్రికుల
పరిభవింపఁ జేసి బెం ♦ పను నెవత్తె
కల, విభూతాఽళి కన్నోద ♦ కముల నొసఁగి
పాలన మొనర్చి పోవఁ జూ ♦ పున నెవత్తె
యమిత శక్తి నైపుణ్యంబు ♦ లమరు తల్లి!
కలిత కల్యాణ నికురుంబ! కన్యకాంబ! 33

మరు భూమి శుష్క శైలం ♦ బరముల నూటలూ
రించి తృషార్తులఁ ♦ దృప్తి పరచి
తల క్రిందులగుచుఁ గొ ♦ మ్మల నంటి తపియించుఁ
గోయష్టికములకుఁ ♦ గూఁడు చూపి
కంచు కా గుండులోఁ ♦ గప్పల సృజియించి
భక్ష్యంబుగా జల్లు ♦ పాచిఁ జూపి
క్రూర జంత్వాది ఘీం ♦ కారముల్ గలకాన
మృగ శాబకములకు ♦ మేఁత చూపి
సర్వ సర్వంసహా సృష్టి ♦ చార చిత్ర
మత్న మహిమల శాస్త్రాన ♦ మానస మైన
త్వన్నిపుణత యగమ్య గు ♦ ణంబు గాఁగ
కలిత కల్యాణ నికురంబ! ♦ కన్యకాంబ! ౩౨

అన్నమో రామచం ♦ ద్రా! యంచుఁ బలవించుఁ
గడు పేద లింట్లఁ బె ♦ క్కండ్రు సుతులు
కట్టు పుట్టము లేక ♦ కష్టా! యనుచు నేడ్చుఁ
గూలికాండ్ర గృహాన ♦ గుంపు గొంపు
ముక్కిడి దాసంగి కే ♦ యున్నతి యైన కురూపు
లకు రంభ కైనయు పెం ♦ డ్లములు దొరుకు
ధన ధాన్య విభవాది ♦ ఘన సస్య సిద్ధులకు
మొక్కో! యన గంజాలి ♦ మొలక లేదు
పుచ్చు చెట్టుకు కాయ పూ ♦ పూచి నటుల
కాఱడవి నిండు తేయొండ ♦ కాఁచి నట్లు
కల్పనవుఁ గర్త్రియైన సం ♦ కల్ప మరయఁ
గాల విపరీతమే సాక్షి ♦ కన్యకాంబ! ౩౩

శ్రీ రాగ రోగంబుఁ ♦ జేకూర్పఁ దయఁ జూపు
భాషాపరాయణా ♦ తారిణా! మాకు
కానఁ డాపకు మమ ♦ జ్ఞానుఁడఁ ద్వత్కరు
ణా కటాక్షము ప్రభా ♦ నీక! మాకు
భైరవాఽసుర శౌర్య ♦ భైరవాఽరోర్కదయే!
భైరవాఽజ హారిష్వ ♦ భాగ్య! పోత్రపు
నోఁడి నీడయి కావఁ ♦ దోప్పడి సుఖమీవ!
పంజర మపనాఽర ♦ వింద! మాఁకు
దానవ ముఖాగ్రి రక్షిత్రో ♦ త్తంస సూరి
శంకరాఽభరణ సువేశి! ♦ సరస వాణి!
మోహనాఽకృతి యభినంద్య ♦ ముఖ్య వియతి!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౩౬

ప్రాయు మాలిక పాము ♦ పట్టి కఱ్వక మున్న
పర్వరుస వదలు ♦ పడక మున్న
కాలు చేయాఁడక ♦ కదల నేరక మున్న
దేహ దార్ఢ్యంబులు ♦ దెసక మున్న
పెండ్లాము గడగండ్లఁ ♦ బెట్టి తిట్టక మున్న
కొడుకులు సొక్కిళ్లు పో ♦ పడక మున్న
మనుకలు కందోయి ♦ కెనఁగి తోపక మున్న
వార్ధక మున చిక్కు ♦ పడక మున్న
తమ పదాఽంభోజముల యాఁడి ♦ గమునొప్పు
నాత్మఁ జాగ్రిద నప్పఁ బు ♦ ణ్యంబు లొసఁగి
జన్మ రాహిత్య మొనరింపు, ♦ సరస వచన!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౩౭

పోత్రముల్ వెదకి త ♦ దుత్తమ ధర్మముల్
జనులకు బోధింపఁ ♦ జదువు లేక
వీనుల విందైన ♦ గానమ్ముచే సభఁ
రంజింప గీత శా ♦ స్త్రంబు రాక
పిట్ట కథల్ జవుల్ ♦ పుట్టఁ జెప్పను నను
నయ మధు రోక్తులిం ♦ తయును లేక
శివ! కేశవా! యంచు ♦ స్తవ మొనర్పగఁ జిత్త
మొక్కచో నిల్ప యో ♦ గ్యుండు గాక
పొట్టకయి భాగవత వేష ♦ మును ధరించి
నుడువ జృంభింతురి వెటకూత ♦ లుడిగి సిగ్గు
వారి కిహ పర సౌఖ్యముల్ ♦ దూర మగును
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౩౭

అసలు దప్పిన మంచ ♦ మెన వచ్చు ననవచ్చుఁ
గాన్య దోషోక్తుల ♦ కబ్బ మిన్ని
తన పద ద్వయికి వం ♦ దనము తారిడుకొని
యాయుస్సు నూరేడు ♦ లహురు సనెడి
మందుని వలె మెప్పు ♦ లందు కొనుచు నుండ
మాన్యులు దప్పని ♦ మందలింప
శాస్త్ర భాషల యందు ♦ జనియించెఁ దొలి యెయ్య
దని వితర్కింప నే ♦ మనక యున్న
మార్పు సూత్రము లేఁజెప్ప ♦ మాదిరిగను
మీకుఁ దెలిసిన యెడఁ బోఱి ♦ పోఁక యనెడి
కుకవులకు ప్రాణ మాన సం ♦ కోజ మేల
తాకి కూతలు మధురంబె,? ♦ కన్యకాంబ! ౩౮

పురాణ విద్యాఽభ్యాస ♦ మొనరించఁ బట్టియే
యాగమాఽధ్యయనంబు ♦ లడవిఁ గలిసె
విద్యాఽధములు సభా ♦ పీఠస్థు లౌటచే
శాస్త్రాఽర్థమగు మాటఁ ♦ సాగ దాయె
నీరుల్లి గడ్డ కె ♦ న్నైన కవీంద్రుండుండఁ
గవి నామధేయముల్ ♦ కవుల కయ్యె
చోర భక్తికి మను ♦ ష్యులు పాలు పడుచుండ
నిజ భక్త నామముల్ ♦ నీటఁ గలిసె
గాన నైపుణ్యము లేరికి ♦ రాని వారు
లేర నెడి యభిప్రాయంబు ♦ లీలఁ దోఁచె
టక్కు న్యాయ మాయె, నిజంబు ♦ ప్రక్క దాయె
కలి యుగ క్రమమే యుందు, ♦ కన్యకాంబ! ౮౨

ఆశు ధారా కవి ♦ తా శైలి బెదరి కొ
గ్లవ గండు పెర్వెత్తు ♦ రకము గాదె
యవధాన కవితా వి ♦ హారంబు మరగాలు
గట్టి పర్వడ సమ ♦ కట్టి నటుల
ఘటికా శతగ్రంథ ♦ కల్పన కవనంబు
జొన్నలో గుడ్డెద్దు ♦ సొఱు విధంబు
ప్రాసాఽంత్య పద కవి ♦ త్వము పోక యొల్లని
బోటికి తలఁబ్రాలు ♦ పోసి నట్లు
యోచనాఽధార సద్రస ♦ యుక్త మైన
కవన రస పోషకులు ధీర ♦ కవులు గాఁక
భువనమున తక్కిన కవులు ♦ భువన కవులు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౩

మా కవిత్వ మరుచి ♦ యై, కను పట్టెనో
భవదంకిత కవిత్వ ♦ మవును రుచులు
మా పద్యము లసూయ ♦ యై పొల్పు గాంచెనో
మీ నామ పద్యంబ ♦ మృత రసంబు
మా కృతి కాంత ఛీ ♦ యై, కను పట్టెనో
త్వ ద్యశః కాంతి భా ♦ స్వ ద్దిగంతి
మా రచనల సూయ ♦ యై. రహిం దెల్లెనో
మీ కథా రచన ల ♦ మేయ శుచులు
గానగాఁ బక్ష పాతులు, ♦ పూనికంబుఁ
గక్కుటము గింజఁ గాదని ♦ ధిక్కరించు
మాత్రముఁ గిరీటము నొగి రా ♦ ణ్మస్తకమునఁ
గాంతిలదె,? త త్సమానమా ♦ కన్యకాంబ! ౨౨

అనపాయ కామోజ్వ ♦ లాఽగ్నిఁ జల్లార్పఁగాఁ
బర సతీ గమనంబు ♦ వర్ష ధార
విపుల మర్యాదా ప్ర ♦ వీణ తాఽంబుధు లింక
బాడబుల ధనంబు ♦ బాడబంబు
బంధుర శుభ గంధ ♦ సింధురంబులఁ గూల్ప
నాడ బిడ్డల సొమ్ము ♦ హరిసమంబు
విస్ఫుర ద్దైఽశ్వర్య ♦ విపినంబుల దహింప
యాచక ధనము ద ♦ వాఽనలంబు
వితత కలుష శైల ♦ వితతి భేదింప మీ
ధ్యాన గరిమ సుర వ ♦ రాఽయుధంబు
భక్త కామితాఽర్థ ♦ ఫల దైవత ద్రుమ!
ఘన సుగుణ కదంబ! ♦ కన్యకాంబ! ౨౩

రాజీవ కమలాకర ♦ రమునఁ గప్పలు బుట్టి
సౌరభ స్వాది వా ♦ సన లరయునె
క్షీరోధిఁ గబళించుఁ ♦ బిఱుదు సిందుగ బొజ్జ
లింపార పాలార ♦ గింపఁ దగునె
కొబ్బెరి కాయఁ జే ♦ కొన్న ప్లవంగమ్ము
తదమృతమానునే? ♦ తనివిఁ దీఱ
చిత్రకళా రూప వి ♦ స్ఫురితములా మూర్ఖ
జీవులు గాంతురే? ♦ చిత్స్వరూపు
తమ కొలంబున జన్మంబుఁ ♦ దాల్చి నట్టి
వైశ్యు తెలియఁగుదురే! శ్వేతకృష్ణ ♦ పారసంబు
తమ్మి చూలికి శూలికిఁ ♦ దఱము గాఁదు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౭

వాగుర లేనిచో ♦ వాగుర కానికి
పక్షి మొత్తంబులు ♦ సిక్కఁ దఱమె?
బోను లేకున్నచో ♦ మూషిక జంత్వాది
జాలంబులనుఁ బట్ట ♦ సాధ్య మగునె
బడిశంబు లేనిచో ♦ పాఠీనములు జాల
కాగ్రిణికి గ్రహింప ♦ నలవి యగునె
పణతుల చూపుటం ♦ పర శక్తి లేనిచో
పురుషులు దాసులై ♦ పొనర దఱమె!
రాజ యోగ ప్రశస్తమం ♦ త్రి ప్రచార
జప తపస్సులు లేకున్న ♦ విపుల నరక
రాశిఁ దఱియ సాధ్యమె, తోయ ♦ రాశిజేడ్య!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౮

పారిజాత మరంద ♦ మేరికి మాధుర్య
మలరదే! పిత్తరో ♦ గులకుఁ దక్క
పంచదార చెఱుకు ♦ పాలింపుఁ జవిగాఁదె
రోగ పీడిత జిహ్వ ♦ రుచికిఁ దక్క
మలయ మారుతపుఁ బెళ ♦ జలువ రాణింపదే!
విరహిణీ జన భాగ్య ♦ విధికిఁ దక్క
కలువల చెలి కాని ♦ వెలుగు మోదము గాఁదె
గురు వియోగ మయ దుః ♦ ఖులకుఁ దక్క
దివ్య దివ్యాఽభినందిత ♦ కావ్యమైన
నీ కథాఽమృత రస మాని ♦ నెగడఁ దగదె!
పతు పాత ప్రజకుఁ దక్క ♦ రతు కిక్క
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౮

పండు వెన్నెల ఱేఁడు ♦ పండమి రాతిరి
నిూనుతుల్ సేయని ♦ వాని పుట్టు
ముక్కఱ గలమోము ♦ ముక్కర నొక్కమి
గతి నిన్నుఱేఁచి పాఁడ ♦ గానినోరు
రాయంచ కువ తేఁక ♦ రాణ గుల్కని కొలఁక
నీ స్మృతి లేని మా ♦ నిసి భవంబు
ప్రజ లేని పాఁడు రా ♦ ష్ట్రమ్ములు రాజరి
కము నిన్నుతింపని ♦ కుమతి పొడుపు
అవని మానుష రూపుఁదై ♦ యవతరించి
నిన్ను వేఁడని జన్మంబు ♦ దున్న పోతు
బ్రతుకు బోఁపదె గమనింప ♦ భావితజ్ఞ!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౯

మకరందమున మహా ♦ మధురిమ లేకున్న
జుంటీగలా లాగుఁ ♦ జుట్టుకొన్న
చంద్రికల సుధార ♦ సంబు లేకున్నఁ జ
కోరము లాసించు ♦ కోఁ దలంచె
గంగా విహార సౌ ♦ ఖ్యంబు లేఁకున్న, రా
యంచలు విహరింప ♦ నరుఁగ నౌనె
త్వత్ప దాబ్జ ధ్యాన ♦ పరమ పథము రాఁక
మానిన మునిసేవ్య ♦ మౌన మౌనె
యఖిల వేదోండ చర్య లీ ♦ యాజ్ఞఁగాదె
దాప నేటికి మీ కృపా ♦ ధార లీల
లర్య కుల దుగ్ధ తోయ రా ♦ శ్యబ్జ బింబ!
కాను పింపవె మ్రొక్కెద, ♦ కన్యకాంబ! ౫౦

ఘన పాప గాఢాంధ ♦ కారంబు వాయునే
త్వన్నామ భాస్కరో ♦ దయము లేఁక
యమిత దారిద్ర్య దా ♦ వాగ్ని చల్లారునే
తమ కీర్తన సువృష్టి ♦ ధార లేఁక
వివిధ రోగగ్రావ ♦ వితతి ఛేదిల్లునే
తావ కార్చన పవి ♦ ధార లేఁక
బహు దుఃఖ రస సప్త ♦ వారాశు లింకునే
భవ దుపాసన బాడ ♦ బంబు లేఁక
స్ఫుర దహంకార గుణ గణాం ♦ భోద వార
పటిమ విచ్ఛిన్న మౌనె, కృ ♦ పా సముద్ర
భవ దనుష్ఠాన పవమాన ♦ బలము లేఁక
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౫౧

సీ|| దేవి పదసేవ • లేదినం బొనరింప
భవ బంధ పాపముల్ • బాసి పోవు
నేమాత కీర్తన • లేప్రొద్దు వల్లింప
పున్నాను వృజినముల్ • బొల్లు లోను
నేశక్తి దర్శనం • బేనాఁడు సిద్ధింప
తంగేటి జున్నయి • తలపుఁ దీఱు
నేపురంధ్రీనుతుల్ • జేపవ ళ్లడరింప
లౌకిక సుజ్ఞాన • లాభ మొదవు
నట్టి భక్తేష్ట దాయిని • వైన నిన్నుఁ
బొగడ నిగమాది ఘోషలు • దగవు జగతి
రాజ్య సామ్రాజ్య సాయుజ్య • పూజ్య మానె!
కలిత కల్యాణ నికురుంబ! • కన్యకాంబ! ౫౨

సీ|| మాన్య చరణ పూ • జా మార్గ మతిశయ
దారిద్య్ర వారాశిఁ • దాఁటు నావ
యేజన నీ పదాం • భోజ స్మృతుల్ పుణ్య
ఫల దివ్య సౌధ సో • పాన పంక్తి
యేతల్లి పదకీర్త • నేతి హాసంబు ము
క్తి ద్వారము తలుపుం • దెఱుచు వైన
మే జనయిత్రి నా • మోజ స్మరణలైహి
కాఽముష్మికములందు • నట్టి బాఁట
యఖిల కామ్య ప్రదాయిని • వై, వెలుంగు
చున్న నినుఁ గొని యాఁడగా • నోపఁజాల
సరస సద్గుణ శీల! య • స్వప్న పాల!
కలిత కల్యాణ నికురుంబ! • కన్యకాంబ! ౫౩

మీ మహా నామాఁక్షరీ మంత్ర జప సుధా
రసమాన దుఃఖ వా ♦ ర్ధర పవనము
పావక శుభ చరి ♦ త్ర పఠనీయే త్యుసా
రముఁ గ్రోల గలుపాఁద్రి ♦ రాజవజ్రి
త్వత్పదాఁబ్జ ధ్యాన ♦ పారిజాత మరంద
సార పానగఁ గష్ట ♦ సర్వ బర్హి
భవ దఁకిత కవిత్వ ♦ యువ తపో దాత్రిఝా ఫ
లము, మెక్క భయ తమ ♦ స్సముదయరవి
గాన, త్రిజగాన, భవదుప ♦ మాన మైన
దైవమునుఁ గాన, నిత్య కీ ♦ ర్తనము మాన,
దాన గుణ నిధాన! శుభ సం ♦ ధాన మాన!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౫౮

అన్యాయ మగు పన్ను ♦ లర్పింత్రు గొప్పకు
నంగలార్తురు కడు ♦ పార గుడువ
కానని కానలోఁ ♦ గట్టింత్రు కోవెలల్
పడిన గుళ్లనుఁ జక్క ♦ పఱుప లేరు
తవణింత్రు నిర్జనాఁ ♦ టవిఁ జలిపందిరుల్
తృషఁ గొని వేఁడగాఁ ♦ దీర్థ మిడరు
కడుపు నిండు ధనాఢ్యుఁ ♦ గడికిఁ బిల్తురు ప్రేమఁ
బికిరంబు తిరిపెంబు ♦ నకు నొసంగఁ
రన్న వస్త్రము లాసింప ♦ కున్నఁ గన్న
సుతులఁ బెంచి నట్టుల బెంచు ♦ చోద్యమాయె
ధన పిశాచముల్ వీరనఁ ♦ దగదె? జగతి
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౫౯

లంజ సుద్దులు సెప్ప ♦ లాలసంబున( బోదు
రయగరు హరి కథా ♦ స్మరణ వినను
నాసాది కూ(తల ♦ నాల కూ(డాలింత్రు
తలపరు భాగవ ♦ తపు( బురాణ
మల్లటి చెయ్యేల ♦ ఖుల్లాసమున( బో(దు
రూతేగరు సుకృతో ♦ ద్యోగ మునకు
గుడి పూజ లడరింప , నడుగిడ లేరు నూ
రామడే గుదురు సూ ♦ పాటన్న ములకు
కో(డె కాండ్రెల్ల మెచ్చ దు ♦ కూళ ముగను
దువ్వి పూచి కట్టి తుఱిమి ♦ తొడ్గి దాల్చి
సానుల వలె నుంద్రు పతి సే ♦ వా నిరతులు
గారు, కలికాల మహిమచే( ♦ గన్యకాంబ! ౫౬

చెలికి జారత్వంబు ♦ చిర పుణ్య మని నేర్పు(
దోలు బొమ్మల యాట ♦ లోలి సొమ్ము
పడతికి పతి సెడ( ♦ బాయు మంచని నేర్పు
నూరి చుట్టఱికంబు ♦ లుగ్గు పోత
మెలతకు వ్యభిచార ♦ మే( మంచిదని నేర్పు(
జెన్నంగి సుద్దులు ♦ కొన్న చదువు
స్త్రీకి చెడు నడత ♦ శ్రేయ మంచని నేర్పు(
దాస రాటల కట్టు ♦ తాలి బొట్టు
ఆ(డ వాండ్రు జాణ , లగుటకు హేతువు
ఆట వెలది గొండ్లి ♦ యాట పట్టు
గుట్టు బైట( బెట్టు( ♦ గోపింతు రార్యులు
కలి యుగక్రమంబె? ♦ కన్యకాంబ! ౫౭

సురలకు గురువైన ♦ గురు సతీ మణి చంద
మామఁ గూఁడి బుధ కు ♦ మారుఁ గనదె!
గౌతమ ముని స్నాన ♦ కౌతుకంబున నది
కరుగ నింద్రునిఁబొంద ♦ దా యహల్య!
పశు పతి వంచించి ♦ భాగీ రథీ దేవి
గనదె భీష్ముని శంత ♦ నుని మఱింగి
కన్నెతి కంబ ని ♦ యెన్నక సూర్యునిఁ
గలిసి కుంతీ దేవి ♦ కర్ణుఁ గనదె?
యిట్టి వార లఘము లౌడి ♦ గట్టు కొనిరె!
యనుచు మీటింగు లాడవాం ♦ డ్రాచరించి
అంకు పనులకై కట్టిటి ♦ కంకణములు
కలి యుగకర్మ మేమందు, ♦ కన్యకాంబ! ౨౭

మీన కేతను నేలు ♦ మేని చాయల డాలు
గల వాఁడు సత్కీర్తి ♦ వెలయు వాఁడు
గౌనయంబు లలరారు ♦ ధన గుహ్యకేశ్వరుఁ
డాజ్ఞా ప్రకార చ ♦ ర్యానను వర్తి
పురుష పటాటోప ♦ మునుఁ గల్గు సరసాగ్రి
గణ్యుఁడు విద్యాధి ♦ కార మలరు
మగనినిఁ దెగ నాఁడి ♦ మనుజాధముని రూప
హీనుని నడవడి ♦ లేని వాని
గుణము లేని శఠుని ♦ గూడుదురు చెడిప
లేమి జెప్ప సాధ్య ♦ మేరి కేని
వారి చరిత ముభయ ♦ వర్ణనాతీతంబు
ఘన సుగుణ కదంబ! ♦ కన్యకాంబ! ౨౮

స్త్రీలకు పరమపా ♦ తివ్రత్యమే సొరు
పైకంబునకు గళ ♦ స్వరము సొరు
రూపహీనులకు వి ♦ ద్యాపటుత్వము సొరు
తాపసేంద్రులకు శాం ♦ తంబు సొరు
చక్రవర్తుల కెల్ల ♦ సత్యవాక్యము సొరు
పురుషుల కుద్యోగ ♦ భూతి సొరు
సైన్యాధిపతి కస్త్ర ♦ శాస్త్ర నైపుణి సొరు
బేరికి వ్యాపార ♦ వృత్తి సొరు
చిత్తశుద్ధి యుత్కృష్టదాస ♦ శేఖరులకు
తమదు మీగాలు తమ్మిపూ ♦ దబము సొరు
యసురభంజనరౌద్ర! ద ♦ యా సముద్ర!
కలిత కల్యాణనికురుంబ! ♦ కన్యకాంబ! ౬౦

సౌందర్యరూపల ♦ క్షణముల శ్రీదేవి
యోర్పు తనంబున ♦ యుర్వి కాంత
యార్తిఁ దీఱఁ దనుపుం ♦ గర్తవ్యముల మాత
శయ్యావిహార వ ♦ ర్తముల వేశ్య
యుపచార సువిచార ♦ సపరి చర్యల దాసి
సముదీర్ణ యోచనాం ♦ శముల మంత్రి
సమపాయ దుఃఖాగ్నిఁ ♦ జల్లార్పు సుఖవృష్టి
సంతాన సుక్షేత్ర ♦ చైత్ర పదవి
యఖిల శుభ రాజి కాకరం ♦ బై, చెలంగు
సతుల గుణశీల యైన భా ♦ ర్యాలలామ
ప్రాప్తి వశమున లభియించు ♦ భర్తబ్రతుకు
గణన సేయఁ దఱంబె? శ్రీ ♦ కన్యకాంబ! ౬౧

స్త్రీ సహవాసంబు ♦ జెట్టు ద్రిమ్మరి మధ్య
మాన వృశ్చిక దష్ట ♦ మైన పవిది
చెడి పలతోఁ బొత్తు ♦ చిడిముడి యన్నిష్ఠ
కుంపటి మెడఁ గట్టు ♦ కొన్న పవిది
నంగ నాచుల పొందు ♦ నల్ల త్రాచును జంటె
ముగ దాల్చి చెడుమిత్రి ♦ బుచ్చినటుల
నెఱ జాణలను నమ్మి ♦ సీతి కాసుల కమ్మి
బాసఁ జేయుట లురిఁ ♦ బడిన పవిది
కాంతల చెలిమి యూవలఁ ♦ గట్టి పెట్టి
తరుణి పెత్తనము తురక ♦ దొర తనంబు
తెఱుక కని స్నేహముల బట్టి ♦ చెఱుపుఁగనరె!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౬౨

స్వాతంత్ర్య నిధియాట ♦ జాతర కరుగుట
పైత్ర్య వేశ్మమున ని ♦ వాసి యవుట
వ్రతము లేకుండుట ♦ పతినెడఁ బాయుట
అంకు టాంద్ర చెలిమి ♦ కంకె యవుట
జీవిక విఱుగుట ♦ జీవితేశు ముదిమి
యమితకాలము విదే ♦ శమున నుంట
యీసు దొడంగుట ♦ యితరింట నిద్దుర
పురుషుల గోష్ఠిలో ♦ బొదలు చుంట
కైపు విక విక నవ్వుట ♦ ఖలుల పొత్తు
కాంత చెడుటకు శరపంక్తి ♦ కారణములు
తమదు దాసుల కీ యవ ♦ స్థలు దొడరవు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౬౩

వేద చోదితమయి ♦ వెలయు సమ్యజ్జ్ఞాన్య
సంకల్పము గురుదా ♦ స్య పరిభావ
మధ్యయనాగమం ♦ బాహార యోగంబు
కర్మ సన్యాస యో ♦ గ క్రమంబు
చరిత విశేష మహోత్స ♦ వంబు చిత్త నిరోధ
మింద్రియ నిగ్రహ ♦ హేతువులను
నెన్ని దంటను కర్మ ♦ హిత యుతానుష్ఠాన
మలరించుఁ ద్విద్దాను ♦ లౌ, మహితులు
తను తమ స్ఫురత్తపో మహ ♦ త్వమునఁ జేసి
బహుళ నిస్సార సంసార ♦ పాశ బద్ధ
సగుణముల జయింత్రుఁ, గడల ♦ ముగిదిగాంతురి,
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౬౮

మానుష జన్మ సం ♦ భవ మన్న దుర్లభ
మలరెఁ బోఁ బురుషుఁడై ♦ వెలయు టరుదు
కలిగెఁ బో రూప వి ♦ క్రమ గుణ స్వము సున్న
వెలసెఁ బో విద్యా వి ♦ వేక మరుదు
అవి యున్న సుగుణ భా ♦ ర్యా రమ దొరకదు
పడుగ నన్యోన్య దాం ♦ పత్య మరుదు
సకల సంపద లొప్ప ♦ సంతానము హుళక్కి
పరిబలెఁ బో నిప్పచ్చ ♦ రంబుఁ గోఱలు
కంజజున కైన లఘు కళం ♦ కంబు గలుగు
పోల్కి నెట్టి మహా పుణ్య ♦ మూర్తి కైన
కలుగ నైశ్వర్య పదవు లీ ♦ కలి యుగమున
కలిత కల్యాణ నికురుంబ! కన్యకాంబ! ౬౯

తమ కృప లేని చోఁ ♦ దపనీయ కుధరంబు
మృణ్మయ పిండ సా ♦ కృతి వహించు
మీ దయ లేని చోఁ ♦ మిన్ను మన్నే కమై
పడరాని యిడుములు ♦ ప్రబల మొందు
నీ యాజ్ఞ లేని చో ♦ నీరధు లేకమై
యుప్పొంగి ప్రవహింప ♦ నుప్పళించు
మీ కృప లేని చోఁ ♦ మిత్ర శశ్యుడు తతుల్
నేలపై దబ్బున ♦ వ్రాలు బూను
యన్నిటికిఁ జూడ మీకృప ♦ యవసరంబు
యదియు సుంతేనిఁ గల్గ నీ ♦ యఖిల భూత
జాలములు యథా వస్థలై ♦ సంచరింతు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౬౬

భక్తిమై పూజ లా ♦ శ్వయుజ మంతయు సేయ
మందార మత నింటి ♦ మల్లె సెట్టు
నవ రాత్రములు ముగ ♦ గ్గవము నోల నుతింపఁ
గామ గోవత నింటి ♦ గాడి మొదవు
విజయ దశమి మనో ♦ విజయంబుఁ గొనియాఁడ
స్వర్ణది వారింటి ♦ వఱద కాల్వ
దుర్గాష్టమి భవన్ను ♦ తులు శ్రద్ధఁ జేయఁజిం
తామణి వారింటి ♦ తాప బండ
పాడ్యమి మొదలు గాని యేక ♦ భావ మూని
ధ్యాన మాసక్తి నొనరింప ♦ నమృత భూతి
వారి పెరటింటి యందు నో ♦ ప్పారునాతి
కలిత కల్యాణనికురుంబ! ♦ కన్యకాంబ! ౬౭

సీ॥ పాద పూజ సుం ♦ తేని సల్పని చేయి
చేయ్యి కాదది కీలు ♦ కొయ్యఁ గాని
తమ కథా వాక్సుధా ♦ ద్రావ నొల్లని చెవుల్
చెవులు గావవి పాఁడు ♦ గవులుఁ గాని
తమ దివ్య నామాఽమృ ♦ తములఁ బల్కని నాల్క
నాల్క గాదది తోలు ♦ చీల్కఁ గాని
త్వత్కథా గానముల్ ♦ పాడ నొల్లని గొంతు
గొంతు గాదది రొచ్చు ♦ గుంతఁ గాని
మానుషాఽత్మక మైన జ ♦ న్మంబుఁ బూని
జ్ఞానమునఁ దలపోయని ♦ మానవుండు
మానవుఁడు గాడు పాద యు ♦ గ్మంపుఁబశువు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౮

జేజేలు, గొను! రాజ ♦ రాజేశ్వరీ! బ్రహ్మ
తేజో విరాజిత! ♦ ధీ సమేత!
దండంబు, ఖండిత ♦ చండ ముండాఽసుర
గండర గండ! సా ♦ కర్య కాండ!
వందనంబులు, దివ్య ♦ వందిత చరణాఽర
విండ! బంధుర రసా ♦ నంద బృంద!
జోహారు, బహు విధ ♦ ద్రోహ పరిహారిణీ!
మోహనాఽకృతి! నత ♦ ముని సమూహ!
శత నమస్కారములు, నత ♦ క్రతుభు జేశ!
నుతులు పదివేలు, లోకాఽభి ♦ నుత చరిత్ర!
మానితోరుప్రణామముల్, ♦ మాన్య ధన్య!
కలిత చైతన్య ముఖబింబ! ♦ కన్యకాంబ! ౭౯

మాటి మాటికిఁ గల్ల ♦ మాటలాడుట కంటె
పుట్టు మూఁగై భువిఁ ♦ బుట్టమేలు
పరసతీ గమనంబు ♦ పురుషుఁ డొందుట కంటె
క్లీబత నగ్నిఁ ద్రె ♦ ళ్ళినను మేలు
కొండెమ్ము లెపుడు ప ♦ ల్గురికిఁ జెప్పుట కంటె
జిహ్వాబీకుకొని చ ♦ చ్చినను మేలు
ఇతర సొమ్ములు దొంగ ♦ లించి మేయుటకంటె
బికిరంబు లాఁగు జీ ♦ వికయె మేలు
పచ్చి ఫోకిరి తన మొప్పు ♦ భార్య కంటె
ధన వధూటిని నాలుగాఁ ♦ గొనుట మేలు
బుధ మనోల్లాసినీ! మహా ♦ పుణ్య శీల!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౦

పర్వతంబునకు సు ♦ పర్ణంబు లున్నట్లు
దుర్మతి కొండ బడు ♦ దొర తనంబు
రెక్కలు గాడుపు ♦ మెక్కరి కున్నట్లు
లవివేకి కిహ సభా ♦ ధ్యక్షత, గన
నిప్పు చూలికి జోడు ♦ నింగి చూలై నట్లు
హంకారి కుద్యోగ ♦ సంకులంబు
పడిశెంబు దగ్గు ము ♦ క్కిడి కొడంబడి నట్లు
పిసిఁడి వానికి జిక్కు ♦ పసిఁడి కుప్ప
మాన హీనుల కజ్ఞాన ♦ మార్గము మెయిఁ
జెడ్డ చెయిదముల్ గఱిసతేఁ ♦ జేయు నెల్ల
దొడ్డ బల్మిఁ, గలిమి, దాల్మి ♦ తోడ్పడమియు
గాదె, వివరింప జగదంబ! ♦ కన్యకాంబ! ౨౧

బ్రాహ్మణ క్షత్రియ ♦ బాంధవ త్రయులను
ద్వ్యమ్మూర్నాఽధికారమం ♦ దునుప రాదు
ఘనము సిద్ధముగాఁ బొ ♦ దవిన మొదటి వాఁడు
కష్ట నిష్ఠుర మైనఁ ♦ గాసాసఁగఁడు
పైకఁబు పై నుంపఁ ♦ బడిన ద్వితీయుండు
యువ యత్నముడుగ నా ♦ యుధము చూఁపు
బంధుత్వ బాంధవ్యతఁ ♦ బాసి తృతీయుండు
సర్వస్వము గ్రహించు ♦ జాఁడ వెదకు
గాన, భూ మ్యుదక ఖముల ♦ ఘాతుక మృగ
మత్స్య ఖగములు భక్షించు ♦ మాంసమువలె
ధనము నెందెవ రెక్లనిఁ ♦ దిన వలఁతురు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౨౪

తామర కువ విందు ♦ దలప వెన్నెలకందు
రిక్క పోత్రివులు రాతి ♦ రింబవళ్లు
గాడ్పు వేలుపు కటం ♦ కట సామి రెండు సం
జలు న్నుపంట పలంతి ♦ జముడు మనసు
సర్వతో ముఖమును ♦ సర్వతోముఖమును
సర్వతోముఖుఁడు భూ ♦ చక్రమందు
ప్రతి భూత ముల నడ ♦ వడిఁ గాంచు చుండ్రది
తెలియక పాపిష్ఠివా ♦ కులు చలమునఁ
గల్మి బల్మి మా యది యని ♦ గర్వకుఘోర
రూఢికృత్తై పాపముల నొన ♦ ర్తురు మదించి
వారు ఘోరాఽఘ పహ్నిలో ♦ వ్రాలి పిడపఁ
గనలరే! చూఁడ జగదంబ! ♦ కన్యకాంబ! ౨౫

త్రికరణ శుద్ధి నే ♦ ర్చిన శాస్త్ర మేనియుఁ
జింతన యప్పు డప్డు ♦ సేయ వలయు
నిల జేరిఁ గొల్చుచు ♦ నే యుండి యాయన
వలన భయంబాత్మ ♦ నిలప వలయు
సద్గోష్ఠి నివసించు ♦ జనరాలి పాత్రేనిఁ
దల గొలిచి వని జాగ్రి ♦ త పడవలయు
మంత్రినఁ గాళికాం ♦ బా ప్రసన్నముఁ గన్న
తన్మాత తో మిత్రి ♦ దలప వలయు
శాస్త్ర రాజ సభూ మహా ♦ శక్తుల వశ
మేరికి ఘటించ సాధ్య మొ ♦ క్కింత యేఁ
దమ పదార్చిత దాస సం ♦ తతికిఁ దక్క
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౮

గురు కళా నిపుణుఁడై ♦ గురు భక్తి లేనివాఁ
డుపకారి కపకార ♦ మొనఁగు వాఁడు
తన యేలిక పనులఁ ♦ దనువుఁ దాచెడి వాఁడు
ప్రాణ మైత్రి ఝలక ♦ హాయ కర్త
తమ కాలు దమ్మినపూ ♦ దబము లేని శమండు
నమ్ము వానికి చెడ్డ ♦ నమ్ము వాఁడు
పరుని సంపద లోఁడఁ ♦ బూనెడు సచివుండు
మేక నన్న పులియై ♦ మెలఁగు వాఁడు
మెప్పుఁ గాంతురే, అచ్చలం ♦ దెప్పుఁ డేని
దెప్పరము లేని యఘముల ♦ కుప్ప వాని
నప్పళింపదె? జముబంట్లు ♦ నిప్పు టేటిఁ
గాలఁ ద్రోయరె? జగదంబ! ♦ కన్యకాంబ! ౭౯

చదువఁ బ్రారంభించు ♦ శాస్త్రంబుఁ జిత్తమై
కల్యము నది రామి ♦ కావ్య పఠన
మొదలిడుఁ దానస్సై ♦ పుణితేమిఁ గైత్రపై
భ్రాంతితోఁ జందోఁది ♦ పఠన లూను
నదిరామిఁ గవిత వ్రా ♦ యం బూనుఁ దన్మతిఁ
గంపింపఁ బౌరాణ ♦ కథ వచింపఁ
దనరుఁ దానఁ జతుర ♦ త్వముఁ దప్పి మది వృథాఁ
యాస మొంది, వ్యసనా ♦ యంబొనర్చు
దాన మేస్లేక కష్ట వ్రి ♦ తముని చపల
బుద్ధి హరి దాస వేషుఁడై ♦ పుర విదేశ
చారుఁడై నంత భృత నాక ♦ సౌఖ్య డగునే
జ్ఞాన ముస నిన్ను వేదక, ♦ కన్యకాంబ! ౨౧

కరుణా రసాఁధార ♦ కమ్మైన నెమ్మోము
నిర్మల వృత్తి రా ♦ జించుఁ జూడ్కి
ముద్దుల మాటలై ♦ ముదమొల్కు పల్కులు
సంఖ్యేయ భాషణాఁ ♦ సక్తి కరము
తొట్రుపాటు గొనమ్ము ♦ తోఁ దిలకించుట
భూరి సోదర భావ ♦ కారణంబు
ప్రీతి ప్రాణిపై నుంపఁ ♦ బడిన పశ్చాత్తాప
మార్యుల యందు మ ♦ హాఁదరణము
సర్వదా, యివి యనురాగ ♦ సాగరమున
నోల లాడెడు నీభక్త ♦ జాల లక్ష
ణోన్నత వతంస గుణములై ♦ యొప్పఁగాదె!
కలిత కల్యాణ నికురుంబ! కన్యకాంబ! ౨౨

అవివేక గోష్ఠిలో ♦ నధిక ప్రలాపి కు
యాని కూఁత లఱవని ♦ యఱుపు లఱచి
యగ్రాసనాధి ప ♦ త్యము వహించి స్వకార్య
మున కేటికో వివేకి ♦ బోవఁ జూచి
తన కేమిఁ దెలియక ♦ తగవు పెద్దైన గోటి
చిటుకుల చేఁ గేలి ♦ సేయఁ దలఁచి
ఫక్కున నవ్వఁగాఁ ♦ బ్రక్క నుండినవార
లొక కుక్క గవిసిన ♦ యూర నున్న
గ్రామ సింహము లేమేమొ ♦ గాంచి తివిరి
మొఱఁగి నట్టుల ఫకఫకల్ ♦ మొలక త్రొక్క
నవ్వ చుందుఱు ప్రాణమా ♦ నములు లేక
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౮

సింహ తలాటముల్ ♦ జేదోయిఁ దాల్చిన
తప్పు కూతలు గూయు ♦ మొప్పెఁ గాను
బొడ్డు గంటల దాల్చి ♦ ముడ్డి ద్రిప్పఁగ మహా
గౌరవంబని నీల్గు ♦ గర్విఁ గాను
బెత్తంబుఁ జేఁ బూని ♦ విత్తాంగ నలవెంటఁ
దిరుగ,డం బాచార ♦ పరుఁడ గాను
గళశోషన నఱచి ♦ గండ పెండేరియముల్
గొనితెంచు గాండ్రించుఁ ♦ గొంటెఁ గాను
దాస దాసుఁడ, దోసముల్ ♦ జేసి నాఁడఁ
దెలిసి నంతఁ గవిత్వంబుఁ ♦ బలుకు వాఁడ
నెటుల మెప్పింతొ కలికాల ♦ మేచి వచ్చె
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౭౯

త్రనసొమ్ము పరునింటఁ ♦ దాచి తెమ్మను వాఁడు
పవలు తేయున కేగు ♦ బాఁట సారి
జార చోరత్వముల్ ♦ సలిపెడి యెల్లాపి
మగ సరసము సేయు ♦ మూన ధనుఁడు
పెద్ద కాలముఁ దన ♦ పెండ్లాముఁ బుట్టింటి
యందుంచతఁడు జూద ♦ మాఁడు వాఁడు
తను సేయు కార్య మ ♦ న్యుని సేయఁబంపువాఁ
డాత్మేడ్య మొరు నింద ♦ లాఁడు వాఁడు
సర్వదా చిత్త జాడ్య కృ ♦ శాను శిఖలఁ
గాగి, నిద్దుర వమ్మయి ♦ గతులు లేక
యుట్టికిని స్వర్గమున కెక్క ♦ కోఁటు పోరె?
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౦

ఊరకుండిన వాని ♦ కుద్యోద్యోతంబును
వంచన కానికిఁ, ♦ బరమ మైత్రి
ధన హీనునికి, దాన ♦ ధర్మ ప్రవర్తన
మింద్రియ హీనుని ♦ కింతిసుఖము
త్యాగుడు మున్నగు ♦ దౌష్ట్య ప్రవర్తికి,
శాస్త్రార్థమున బ్రియో ♦ జన గుణంబు
పిసిఁడి వానికి, సౌఖ్య ♦ వృద్ధి ధనంబున్న
బోగు రెక్కు మంత్రులు ♦ బోనరు పతికి
రాష్ట్రము, జుగుప్స గిలి గల్గు ♦ ప్రజకుమీఁదు
పద కమల భక్తి సామ్రాజ్య ♦ పదవి, పెంపుఁ
గావు, గలిగె పోఁ బన్నిటిఁ ♦ గలుపు బుద్ధి
కతనఁ దోపదె? జగదంబ! ♦ కన్యకాంబ! ౮౧

చెఱుపు నుండి తొలఁగిం ♦ చిన వాఁడు నెచ్చెలి
దోష రహిత మెయ్య ♦ దో, యది, పత్ని
పతి యానతిగఁ జరిం ♦ పఁ గలదో, యది భార్య
మద గర్వ హీత మేదో ♦ యదియె, కల్మి
యాసఁ జెందని వాఁడ ♦ నారత సౌఖ్యపూఁ
రుష మణి నీతి ధు ♦ ర్యుండు సఖుఁడు
పంచేంద్రియములతో ♦ బాధ లేని యతండు
మగవాఁడు సుజనుల ♦ తెగల యందు
గౌరవార్హుఁడో యతడు సు ♦ జ్ఞాన శాలి
మానసమున మీ కీర్తనల్ ♦ మరువఁ బోక
యుపహారహము సేయు వాఁడుమ ♦ ర్త్యాఽగ్రజుండు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౨

కడుపార గుడువక ♦ పుడమిలో లోఁతగు
గోతులలోఁ బూడ్చు ♦ కొన్న దుడ్డు
తన సౌఖ్యమును మాని ♦ ధనమార్జనము పూని
పిసిఁడి చేతల గూడ ♦ బెట్టు పసిఁడి
కృపణస్వము వినిమో ♦ గింప దేవబ్రాహ్మ
ణులకు యుక్తముగాదు ♦ ఫలము లేదు
యీనమూడు విత్తమ్ము ♦ లిల జేని పాలగ్గి
పాలు చోరుల పాలు ♦ పడును గాని
మంచితోఁ గూడు కొను టేవి, ♦ మదము లేని
జ్ఞాన మోరుపుఁ గల పరా ♦ క్రమము, దాన,
ధర్మ యుత విత్త మీనాల్గు ♦ దగవె వరికి,
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౩

నెలయేఱు దాముకు పో ♦ కలు జవ్వనంబస్థి
రమ్ము, సంపదలు పా ♦ రదము పోల్కి
చాంచల్యము, మనుష్య ♦ జన్మము నీఁటి బు
గ్గవలె నెన్న నచిరం ♦ బవతరించు
ఫేనంబు రీతి జీ ♦ వితము నిస్సారంబు,
సంసార మూర్మికా ♦ సమము చలన,
మమర పూ ర్ద్వారాఽర్గ ♦ ళముఁ దీయు ధర్మార్థ
మేకాంత బుద్ధితో ♦ నెవ్వ రివరొ
వారు ముదిమి ముదర ♦ వాఁడి పశ్చాత్తాప
మొంది, శోక వహ్ని ♦ గుంది మండి
పోవు వింత కనరు, ♦ మూఢ చూడామణుల్
ఘన సుగుణకదంబ! ♦ కన్యకాంబ! ౮౪

ధీరుఁడు, ధనము సే ♦ కూరమి సత్కార
మున నున్నత పదవిఁ ♦ బొంపిరి కను
నంద, యయ్యది యెంత ♦ పడి యున్న నట్టుల
నల్ప లేఁ డవమాన ♦ శాస్త్రిఁ బొందు
సింగంబునకు గుణ ♦ శ్రేణికి తావల
మలరు స్వాభావిక ♦ మైన కాంతి
కుక్కకు తావిపూ ♦ గుత్తి దండల మెడఁ
దవిలింప సొబగు నెం ♦ దం దటంబె?
దాని మాదిరియట్లు త్వ ♦ త్పాద కమల
యుగళ శుశ్రూషఁ గల స్వాంత ♦ యుక్తులొందు
పున్నియం బన్నల కటుల ♦ నన్నె! పొంద
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౫

భూరి మత్తేభముల్ ♦ ఘోర భల్లూకముల్
పారీంద్రములు పులుల్ ♦ బరువు లాఁడు
గాంతారము పురంబు ♦ గా, మ్రాఁకు నిల్లుగాఁ
గంద మూలముల భో ♦ గ్య ముగ, మేసి
కమలంబుఁ గడు పార ♦ గాఁ ద్రావి నారహో
చల పుట్టముల్ మేని ♦ చాటు కూని
గడ్డియే పానుపు ♦ గాఁ బండి, జీవించు
చుండుటే మేలైన ♦ యునికి పట్టు
ధనము నుడి పోవగ, సరిబాం ♦ ధవుల నడుమ
బ్రతుకు సరిగాదు కుక్కల ♦ గతుకు బోలు
కాపురము సేయఁ గేళికి ♦ దాపు రంబు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౬

క్రలిమిచే విఱవీగు ♦ కాలమం దోర్పుచే
నుండరు బొక్కసం ♦ బోఁటుగాగ
పట్ట మంచని యొక్క ♦ పట్టె డన్నము బెట్టఁ
జాలరు బ్రతికింపఁ ♦ జాలు పవిది
జల్పాకు లాఁడు వా ♦ చాఁటుండు వ్యక్షుఁడో
తెంకాయ తోఁటలోఁ ♦ దిఱుఁగు క్రోతి
యౌవనం బంతయు ♦ ద్య క్త ఫలములుగాఁ
జేయ నోచునె కాని ♦ చివరకేని
దాని కిసుమంతఁ దమిదీఱఁ ♦ దఱమొ! తలపఁ
దోపు కాపుకు నష్టంబు ♦ దోపుటెంతో
యంతియే, యుపయుక్త మా ♦ వంతలేమిఁ
గతన నిష్ప్రూపా పావరదే! ♦ కన్యకాంబ! ౮౭

అండ యాపును లేక ♦ యప్పు పుట్టని యూరు
తనమాఁట సరకుసే ♦ యని భటుండు
చెడిన పెండ్లాముతోఁ ♦ జేయు కాపురము లో
లోనఁజెఱుపుఁ జేయఁ ♦ బూను సఖుడు
కుంభీనసము దిఱుం ♦ గు, గృహమునఁ బడక
గోముఖ వ్యాఘ్రిఁ ♦ గూడి నడుట
యివి యూరు చావుకు ♦ హేతువు లని పల్క
తార్కికులకు నేనిఁ ♦ దఱమె! శంక
వానిఁ దెలిసి విడువ ♦ వలయు సత్వరముగ
జాగరూకతల క ♦ సాల పడక
యెంత బుద్ధి మంతుఁ ♦ డేనిఁ జొచ్చగ రాఁదు
ఘన సుగుణ కదంబ! ♦ కన్యకాంబ! ౮౮

మితభాషణము లాఁడ ♦ మెత్తని యంబేన,
మాఁటలాడక చరిం ♦ పగను మూఁక,
మాఁటనేర్పరి యైన ♦ మాటల మారియో,
ప్రేలుడు కాయయో, ♦ పిచ్చివాఁడొ,
యోర్చిన యెడ పంద, ♦ యోర్పుఁ గల్గమి ప్రాయి
కపుఁ జెడ్డకాలములోఁ ♦ గల్గువాఁడు,
ప్రక్క న్నిలిచినఁ దెం ♦ పరి దూరముగ నున్న
భావితజ్ఞుండైన ♦ వాఁడు, కాఁడు
అనుచు నిందింత్రు సేవకు ♦ లనుఁ, దఱంబె!
దాస్య మొనరింప నేరికి ♦ దానిమర్మ
మెట్టి యోగ్యుల కేనియు ♦ నెఱుక పడునె!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౮౯

తొమ్మిది నెలలు గ ♦ ర్భమ్ము మోసి కుమారుఁ
గని పెంచి పరిణయ ♦ కాంక్ష దీర
జెలువార నొనరింపఁ ♦ గులకాంత పుష్పవ
తీ తిలక యయియే ♦ తెంప నిలుకు
నూనూగు మీసాల ♦ నూత్నయౌవ్వన మొప్పఁ
జాఁకినమఱులు ని ♦ రాకరించి
తలిని దయ్యాల్గంపఁ ♦ జెలియలిఁ జేదుకా
యగఁజూచు దారను ♦ నంటిపండు
మగ్గలిని మానికము నత్త ♦ మామగారిఁ
బ్రాణ బాంధవులుగ నెన్నుఁ ♦ బదుపుగత్తె
నరయరె? లవంగపుమ్ముగ్గ ♦ నవగుణులొగి
కలియుగ క్రమమేమందు! ♦ కన్యకాంబ! ౯౦

పుట్టెడు సొగసుల ♦ పుట్టయై హొయలచే
దిట్టరియై వగ ♦ లుట్టిపడగ
చిన్నారిప్రాయంబు ♦ సెన్నారఁజాఁకిన
పెరిమె సైతము మాని ♦ పెండిలనియుఁ
బసిఁడిపై యాసతో ♦ నసువులు వోనున్న
ముసలి పిశాచికి ♦ నొసఁగి కూఁతు
వడుపోగిరముఁ దినక ♦ బ్రాల్పడి వేవేలు
పుల కల్లునికిఁ జావు ♦ మూఁడుటకయి
మొక్కుకులిడి, ముడుపుల్ గట్టి, ♦ యొక్కపొద్దు
లుండి, కాపురమున కంప ♦ నొడలు న్రుక్కి
కాఁటికిని కాళ్లుసాపంద ♦ గండొమగఁడు
కలియుగ క్రమ మేమందు! ♦ కన్యకాంబ! ౯౧

మేనరికంబీయ । మానిరి కొందఱు
కొందఱు కులహీన । మొంది నడిరి
అక్కబిడ్డను వివా । హముఁ జేసుకోనైరి
కొందఱెదురు వియ్య । మందుకొనిరి
విత్తంబునకు సుతఁ । విక్రయింపఁగ నైరి
ముండ మోపులవరిం । పుల కడరిరి
బొక్కసంబునుఁ బట్టి । బొక్కకుఁ బోనున్న
ముసిలి బగ్గుకుఁ గూతు । నొసఁగ నైరి
వావి వరుసల దెగనాఁడి । ప్రాయి కంపు
కుత్సిత కృతాశ్రయుకు లైరి । కుక్షి కొఱకుఁ
జెప్ప సాజ్జమొ? మనవారి । చెడు నడతలు
కలియుగ క్రమ మేమందు? । కన్యకాంబ! ౯౨

సాని జాణల నమ్మి । చరచిరాఽస్తుల నమ్మి
యొసగాలు బిడ్డల । కోగిరంబు
దినుటకు నప్రాప్తి । నొనరించి మొగముండ
లను కీర్తి నార్జించి । యనుదినంబు
లేని కోర్కెల గోరి । లేమి నెత్తిన నూరి
విడిచిన యోచనల్ । వెదకి కొనుచు
తుట్టతుదకు నొక్క । బొట్టు లాభముఁ జిక్క
కువిద తాలీ బొట్టు । కునురు బోసి
విక్రయింపగ నుంకించి । వెఱ్ఱిముదిరి
గోడపైనున్న మార్జాల । గుణము రీతి
మది, స్థిమితములేఁ కట్టిట్లుఁ । బొదల, సుకృత
కర్తయగునెనిఁదలపోయక, । కన్యకాంబ! ౯౩

వైశ్యాఽర్భకులు ప్రౌఢ ♦ వేశ్యలిండ్లకుఁ బోవఁ
గమనించి చోరాఽగ్ర ♦ గణ్యు లగుచు
మానాఽభిమానంబు ♦ మాని దుష్కృత్యమా
పేకలాఁడగ నెంచి ♦ పైక మునకు
మోసంపుఁ జెయ్వులఁ ♦ జేసి పోదాల సా
వాసంబుఁ బట్టొక్క ♦ కాసు ఱువ్వ
లేకుండఁ గొఱిగించి ♦ లేమిడి నార్జించి
కోర్టులో ననృత సా ♦ క్షులకుఁ బూని
యేమి తోఁపక దిక్కెవ్వ ♦ రెఱుక పడక
బ్రతుకు దెరువెఱుగక మనో ♦ రాజ్య మేలు
కొనుచు నున్నాడులై యున్నఁ ♦ గనునె! మేలు
జ్ఞానమున నిన్ను వేఁడక! ♦ కన్యకాంబ! ౫౮

దురదృష్టమున దరి ♦ ద్రికి సిగ్గు లభించు
లజ్జ నంట మనోబ ♦ లంబుఁ దొలఁగు
బుద్ధి బలంబు గో ♦ ల్పోవఁ గేళియొనర్తు
రవమాన బాధచే ♦ నమరు విసువు
విసుగుఁ జెందఁగ దుఃఖ ♦ రస వార్ధిని మునుంగు
దానఁ గూలిన వాని ♦ కైన మనసు
పోవును మది చెడి ♦ పోవ నున్మాదంబు
సనుదెంచు వాన నా ♦ శంబు నొందు
సర్ప దష్టంబు నెంతేని ♦ సైప వచ్చు
బాపురే! సుంతి దురదృష్ట ♦ బాధ కోర్వ
నగునె!యన గొప్ప కడగండ్ల ♦ కాఁట పట్టు
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౫౯

త్రారధిష్ఠించెదు ♦ దైవంబు ప్రతికూల
వర్తియై, పని భంగ ♦ పాటుగుదుర
పురుష ప్రయత్నంబుఁ ♦ బురిగొన సాగక
వ్యర్థమై నివ్వల ♦ వ్యాప్తి గొఱల
నిప్పచ్చరంబు సెం ♦ దిన మానవంతుని
కడవిలోఁ దక్క సౌ ♦ ఖ్యమెచటుఁ గను!
తద్దరిద్రుఁడు ప్రాణ ♦ దానమేనియు నిచ్చు
గాని లేమిడిఁ గుందఁ ♦ గాఁ దగండు
ఆఱియే, పోవునే! కాని ♦ యగ్నికణము
జల్లఁ బడ నణుమాత్రంబుఁ ♦ జాల దట్లు
దైవత స్తుత్య గుణజాల! ♦ ధర్మశీల!
కలిత కల్యాణనికురుంబ! ♦ కన్యకాంబ! ౯౬

ప్రకుర సుక్షేమ ♦ నిక్షేపములు మొలా
లించి సంతతముఁ బా ♦ లించు మమ్మ!
సందె దానందంబు ♦ సద్యశః ప్రభలు వె
ల్గించి పాపములఁ దొ ♦ ల్గించు మమ్మ!
శాశ్వతైశ్వర్య సు ♦ జ్ఞానోన్నతులఁ బ్రసా
దించి శుగ్గురుల ఖే ♦ దించు మమ్మ!
కరుణారసాఽమృత ♦ భరితాఽబ్ధి నోలలా
డించి పుణ్యముల నిం ♦ డించు మమ్మ!
కుందనపు బొమ్మ! గడగండ్లఁ ♦ గుందితమ్మ!
యమ్మలకునమ్మ! చిత్కళ ♦ లమర కొమ్మ!
భక్తులకు వేల్పుమ్రాన్కొమ్మ! పరులసొమ్మ!
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౯౭

వాణీశ్వరాఽనీక ♦ మానసాఽబ్జ విహారి!
హరిహరాఽబ్జార్చిత ♦ చరణ పద్మ!
పద్మాఽలయ స్తోత్రి ♦ పాతాఽవతారిణీ!
తార నీహార జి ♦ తోరు కీర్తి!
కీర్తిత దానేష్ట ♦ గీర్వాణ భూమిజ!
భూమిజా స్తుత గుణా ♦ భ్యుదయ సార!
సారస రిపు తిర ♦ స్కార కృన్ముఖవర్ణ!
వర్ణనాఽతీత సం ♦ పూర్ణ భావ!
భావ భవ జయాఽలంకార! ♦ పావనాఽంక!
యాంక జిత నాక లోకేశ ♦ హస్తిహస్త!
హస్తములు మోడ్చుఁ దొలగింపు ♦ మన్న కలత
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౯౮

లసదఽమాలిన్యక ♦ ళా శరత్సమయ భా
స్వన్మేఘ జిత్కరి ♦ భా, జోహారు
ప్రభిదఽహంకార వి ♦ పక్షరా క్షకరిణీ!
ప్రేమాఽర్ద్రహృచ్ఛ్రీశ్వ ♦ రీ! జోహారు
సమద దుర్దాంత ని ♦ శాచరోద్ధృతి విరా
మప్రాభి దోర్వీక్రి ♦ మా!, జోహారు
విబుధ మానీశ్వర ♦ బృంద వందిత పదాం
భోజాత! భక్తావ ♦ నా!, జోహారు
మృదు మధుర భవ్య రస గుణ, ♦ సదఽమలపద
సీసపద్యశతక సుమ ♦ శ్రీ, ప్రదసర
మొనరిచి బగిదిఁ, గుదురగ ♦ నొసఁగెదదయ
గను గొంచెదనాత్మఁ, నిన్ను కన్యకాంబ! ౯౯

యుష్మత్పదాఽంభోజ ♦ యుగ్మరోలంబాయ
మానమానసుడనై ♦ ముక్త్యపదవి
సాయుజ్యమార్జింప ♦ సంసార చక్ర చం
క్రమణజాంబాల మ ♦ గ్నంబు పొనరు
మా దృశ జన్మాఽఘ ♦ మండలంబు దహింపు
టకు మున్న జాగ్రత్త ♦ ధవిణ గొట్టి
శ్రీసముద్భవ పద ♦ శ్రేయో విలాసస్థ
సీస పద్య శతాబ్జ ♦ శ్రేణిఁ గూర్చి
భక్తి యుక్తాఽంజలి మొగిడ్చి ♦ వ్యక్తిఁ బెంచి
వక్తలకు శ్రోతలకు మెప్పు ♦ వ్యక్తిపడగ
నప్పగింతు నామ్రోలఁ బ్ర ♦ త్యక్షమగుము
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౦౦

భక్తి శ్రద్ధాఽసక్తిఁ ♦ బ్రతిదినం బీమహా
శతక మాణిక్య మే ♦ జనులు గాని
శ్రవణేంద్రియంబుల ♦ శబ్ద సుధా ప్రధా
రావాహికముఁ దృప్తిఁ ♦ ద్రావి రేనిఁ
పారాయణముఁ జేసి ♦ పాపములఁ ద్రోసి
దుఃఖాంకురముఁ గోసి ♦ తొడరి రేని
శాశ్వతైశ్వర్యంబు ♦ సంతాన నిలయంబు
సంతత సంతోష ♦ సౌఖ్య చయము
బాఁడి పంటలు ధనధాన్య ♦ భాగ్యరాజిఁ
గ్వచిదయాచితకల్యాణ ♦ కార్య నిధుల,
నొసఁగిరక్షింపవే? విపు ♦ లోర్జితముగఁ,
కలిత కల్యాణ నికురుంబ! ♦ కన్యకాంబ! ౧౦౧

మత్తకోకిల॥ కన్యకా పరమేశ్వరీ! తమ ♦ కాలు దమ్ములఁ గొల్తునీ
కన్యుపం దలపోయఁ గానుద్వ ♦ వఽన్వయోద్భవుడన్ గవిన్
మాన్య ధన్యుని జేయుమంబిక! ♦ మంజువాక్కవితా లసత్
కన్యఁ జేసి యొసంగితిన్ జెలి ♦ కత్తెఁ గాఁ గొని ప్రోవవే?

## గద్యము.

ఇతి॥ శ్రీమత్కన్యకాపరమేశ్వరీచరణాఽరవిందమరందబిందునిష్యం
దమిళిందాఽయమానమానస, సద్గుణగణవిలాస, పదవాక్య
ప్రమాణపారావారధురీణ నామాంకులకలశవారాశిసంపూ
ర్ణశరత్సోమ, సరసకవితాలతావితానాఽభిరామ, కళా
సిరస్సీమంతముక్తామణి, యాంధ్రకవిశిఖామణి, మ
హాన్వై భవ, గరుడయాఽమాత్యతనూభవ.
సుధీవిధేయ, వేంకటసుబ్బయ్యనామ
ధేయ, ప్రణీతంబైనశ్రీకన్య
కాంబాసీసపద్యశతక
ము, పరిసమా
ప్తము.

శ్రీ

ఓం తత్సత్, శ్రీకన్యకాంబాయైనమః

శ్రీ జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, 1925.

శ్రీ

# బాలభారతీగ్రంథనిలయము.

చాగలమఱ్ఱి

(కర్నూల్ జిల్లా)—దత్తమండలము

స్థాపితము 1923

ముఖ్యోద్దేశము.

భాషోద్ధారణ ! పరిశ్రమపోషణ!

ఇందు

ప్రతి రెండుమాసములకు మత, సాంఘిక, దేశీయ పౌరాణిక, [illegible]రాష్ట్ర, పరిశోధక, నవలలుకాని రసవంతములగు నాటకములుకాని, శ్రే[illegible]త మములగు పద్యకావ్యములుగాని, వొకటి వొంతునతప్పక ప్రకటింతుము.

చందాదార్లుగా చేరగోరువారు ప్రవేశరుసుము రు 0-8-0 ముందుగా చెల్లించి రశీదు పొందవలయును.

ప్రతిరెండు మాసములకు ప్రకటించు ప్రతిగ్రంథమును చందాదారులు తప్పకతీసుకొనవలయును.

పోస్టుమునకగు తపాలా ఖర్చులన్నియు చందాదారులే భరించుకొనవలయును.

మాచందాదారులకు యితరులకన్న నూటికి యిరువదియైదు [illegible]లవంతున ధరలు తగ్గించి పంపబడును.

చందాదారులుగా చేరగోరువారు వెనుకటి గ్రంథములు, అనుబంధములుకాని కొననక్కరలేదు. వలయునన్నచో వాటినిసహా తగ్గింపు వెలకే పంపబడును.

చిరునామా మారినవెంటనే మాకు తెలుపవలయును.

మాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవలసినచో తమ చందా నెం

బడు తెలుపనిచో జవాబు వ్రాయుట కష్టసాధ్యము.

రసవంతములగు నాటకములను, నవలలను తదితరగ్రంథములను, మా చందాదార్లుగాని, లేకయితరులుకాని మాకుపంపినచో వందనపూర్వకముగా నందుకొని, ముద్రణాయోగ్యముగా నున్నచో తప్పక ప్రకటింతుము.

## గనుక

మాగ్రంథనిలయమునకు మహారాజ పోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు, శాశ్వత చందాదార్లుగాను చేరి భాషాభిపోషకులను పెంచి, విద్యావిహీనతారోగమును గుదుర్పెంతురని నమ్మియున్నాను.

## విరాళములు



| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు 116—0—0 |
| రాజపోషకులు | 50—0—0 |
| పోషకులు | 25—0—0 |
| సహాయులు | 12—8—0 |
| శాశ్వతచందాదార్లు | 7—2—0 |

మహారాజపోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు, వీరల నామములను, చేరినలాగాయతి మాయొక్క ప్రతిపుస్తకము నందులో చేర్చబడును.

పోషకులు, సహాయులు, శాశ్వతచందాదార్లు వీరలు ప్రతిసంవత్సరము వారివారి విరాళములను చెల్లించుచుండవలయును.

మహారాజపోషకులు, రాజపోషకులు, కార్యములపట్ల సర్వవిధములగు సహాయములు చేయవలయును.

పైఅయిదు తరగతులవారికి ప్రతిరెండుమాసములకు వెలువడు ప్రతి గ్రంథమును పోష్టుఖర్చులు యావత్తు మేమే భరించుచు వుచితముగా పంపెదము.

మొదటి మూడు తరగతులవారికి మాత్రము మాగ్రంధనిలయమున ప్రకటించు ప్రతిపత్రమును వుచితముగా బంపెదము.

మాగ్రంధ నిలయమునకు వొక రాజపోషకునిగాని, ఇద్దరు పోషకులుగాని, నలుగురు సహాయులును గాని, పదిమంది శాశ్వత చందాదార్లనుగాని, చేర్చువారికి మాచే వెలువరింపబడిన ఒక నవలను నాటకమును పంపెదము. 25 మంది చందాదార్లను చేర్చువారికి మాగ్రంధములలోని యేదేని వారుకోరిన ఒకపత్రమును వారికి వుచితముగా పంపబడును.

మాకు ఏజంట్లుగానుండి పనిచేయువారికి మంచి కమీషన్ యివ్వబడును. గాన వివరములకు వ్రాసినచో నిబంధనలు తెలుపబడును.

## మాపత్రములందు యితర ప్రకటనల రేట్లు

| | | | |
|---|---|---|---|
| టైటిల్ పేజీపయిన | | పేజీ 1కి | రు 8—0—0 |
| ,, | ½ | ,, | 5—0—0 |
| ,, లోపలిభాగమున | | ,, | 6—0—0 |
| ,, | ½ | ,, | 4—0—0 |
| లోపలిపేజీ డెమ్మీక్రౌసైజు. | | ,, | 5—0—0 |
| ,, | ½ | ,, | 3—0—0 |
| ,, | ¼ | ,, | 2—0—0 |

## యితరప్రకటనలు

# విషాంకుశ.

### ఉపయోగించు విధము

తేలుకాటు తగిలిన చోటునందు పైకనుపరచిన నల్లని మందులో బియ్యపు ప్రమాణమును, తెల్లమందులో 1-బియ్యపు ప్రమాణమును యెత్తి పెట్టి దానిమీద 1 చుక్క చన్నీళ్ళు విడువవలెను, విడిచిన తోడనే బుసబుసయని కొంచెము పొంగును. ఆపొంగు అణిగిన తోడనే నిండుగానీళ్ళు విడిచి కడిగివేయవలెను. పైచెప్పినమందు పాము, మండ్రగబ్బ, కుక్క, ఎలుక, మొదలగు విషజంతువుల కాటులకు పయిచెప్పిన విధముగా మిరియాలగింజ ప్రమాణం ఉపయోగించవలెను, ఇట్లు ఉపయోగించినయెడల అన్ని

నివృత్తియగును. మొదట ఉపయోగించి విషము పోనియెడల రెండవతూరి ఆదేమాదిరి చేయవలసినది.

పాకెట్టు 1కి 0—6—0     1 డజను పాకెట్లు రు 3—0—0

ఇదియుగాక మాయొద్ద పలువిధ రంగులలో ఖద్దరు కోటుగుడ్డలు సరట్లగుడ్డలు బనియన్లు వగైరా సామానులు దొరుకును కోటుగుడ్డ గజం 1.కి 1-8-0 సరటుగుడ్డ గజం 1కి 0-12-0 బనియను 1-0-0

యం. సి. సుబ్బయ్యశెట్టి,
ఆయుర్వేదిక్ అండు యూనానీ సిద్ధాన్త
భారతీ పరిశ్రమాలయము
చాగలమఱ్ఱి (కర్నూలు డిస్ట్రిక్టు)

అయిదవరత్నము !!     త్వరలో వెలువడుచున్నది !!

# ప్రియదర్శిని

(చరిత్రాత్మకనవల)

## గ్రంథకర్త శ్రీపాలపర్తి సూర్యనారాయణగారు.

ప్రియదర్శిని యనునది యొక చరిత్రాత్మక నవలారాజము. సాంఘిక, నైతిక, చరిత్రాత్మక, విషయిక ప్రియదర్శనము. ఆంధ్ర పఠన సుదారస ప్రియదర్శనము. వివిధసుమధుర వర్ణనాచాతురీ ప్రియదర్శనము. నవీన గుణభ్యాస కుంఠిత ప్రియదర్శనము. చదివియే తీరవలయును. వ్రాయుట యాత్మభూషణమగును. సరసమగు శైలి, మృదుమధురభాషణములు. హృదయాహ్లాద వర్ణనలు, దేశభక్తి ప్రపూరితము, నిర్దూషిత విషయస్తము, క్షాత్రరసపోషితము. ప్రేమైక భూషితము. శృంగారభాషితము. చిత్రపట శోభితము, సుమారు 300 పుటలు చక్కనిబైండు.

| వెల | చందాదారులకు | కాలికోబైండు | రు 1-0-0 |
|---|---|---|---|
| ,, | ఇతరులకు | ,, | 1 8-0 |
| ,, | ,, | సాదాప్రతి | 1-4-0 |

పోస్టేజివేరు.

# మేవాడుపతనము

సుప్రసిద్ధ కవిశేఖరుండగు బాబూ ద్విజేంద్రలాల్ రాయిగారి వంగభాషా రూపకానువాదము. వారి రూపకరచన జగత్ప్రసిద్ధమగుట వేరుగ వ్రాయనక్కరలేదు. మాన్సిచేఁ బోషింపఁబడిన కరుణరసమును గోవిందసింహునిచే వన్నెకెక్కిన క్షాత్రరసమును, మహబత్ ఖానుని పట్టుదలయును జదివియే తీరవలయును.

హృద్యములగు పద్యములు, అత్యంత మధురములగు గేయములు, సాహిత్యసంపోషిత గద్యములు, ఇందలి ప్రధానాంశములు. క్యాలికో బైండు అనువాదకులు శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారు. సుప్రసిద్ధ హిందీ వంగ భాషావిశారదులగు శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారి పీఠికతోసహా.

| | |
|---|---|
| చందాదారులకు | రు 1—0—0 |
| యితరులకు | 1—8—0 |

# మనోరమావిజయము (చారిత్రాత్మకనాటకము)

గ్రంథకర్త

రిటయర్డు రివిన్యూయిన్స్పెక్టరు, జంధ్యాల [illegible].

ఇందు మనోరమ తన భర్తకొరకై యొనరించినట్టియు సాహసములును అత్యద్భుత భయంకరములు, హీల్‌దార్ఖాన్ గారి సంభోగములును డాక్టరుగారి దయార్ద్రహృదయమును ... కాగు విరాగియగు భర్తను సంసారమునకు ద్రిప్పిన పతివ్రతాచరిత్రము. ఇందలి బాంధవ్యమును బోధించు పద్యములు, వృత్తములు, మిగుల హృద్యములు.

| | |
|---|---|
| వెల చందాదారులకు | రు 0—12—0 |
| యితరులకు | 1—0—0 |

దొరుకువారు:—

శ్రీ బాలభారతీగ్రంథనిలయము.

చాగలమర్రి (కర్నూలుజిల్లా)

# ఇతర ప్రకటనలు

**ఇటుచూడుడు!**

చేతిపనుల నుద్ధరింపుడు !!!

**మాచే తమగృహముల నలంకరింపుడు!**

వెలసరసము!

ఫలమధికము !!!

**మాకంపెనిలో** మంచిపనివారలచే ఇనుముతో చెక్కతో చెయ్యబడి సరియగు మెరుగు వెయ్యబడిన గృహోపకరణములు మిక్కిలి సరసమగు వెలలకు దొరుకును.

గొప్పగా ఆర్డరు యిచ్చువారికి మంచిలాభకరము. తరుణమును పోగొట్టుకొనకుడు. వొకపరి మాసామానులను తెప్పించి వాటిగుణములను కనుగొనుడు.

## సామానులయొక్క వెలలవివరము.

| సామానులయొక్క పేర్లు | ఇనుము డజను 1కి | | | ఇనుము వస్తువు 1కి | | | చెక్క డజను 1కి | | | చెక్క వస్తువు 1కి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సాదామడతకుర్చీ (దళసరియినుపపట్టా) | రూ 40 | 0 | 0 | రు 3 | 8 | 0 | రు 50 | 0 | 0 | రు 4 | 8 | 0 |
| డిటో (సన్న యినుపపట్టా) మేలురకం జేకుమడతకుర్చీ | 35 | 0 | 0 | 3 | 0 | 0 | 65 | 0 | 0 | 6 | 0 | 0 |
| మడతకుర్చీ (చేతులు కలది) | 45 | 0 | 0 | 4 | 0 | 0 | 110 | 0 | 0 | 10 | 0 | 0 |
| సాదాయీజీచేర్ ఆకుపచ్చ కాన్వాస్ పట్టతోసహా | 80 | 0 | 0 | 7 | 0 | 0 | 80 | 0 | 0 | 7 | 0 | 0 |
| డిటో చేతులుకలది | 100 | 0 | 0 | 9 | 0 | 0 | 100 | 0 | 0 | 9 | 0 | 0 |
| క్యాంపుకాటు (పట్టతోసహా) | 170 | 0 | 0 | 5 | 0 | 0 | 110 | 0 | 0 | 10 | 0 | 0 |

2

| | | | | |
|---|---|---|---|---|
| వలచట్టము | రు 20 0 0 | 2 0 0 | 20 0 0 | 2 0 0 |
| ప్రయ్యాలకుర్చి (పట్టుతోసహా) | 220 0 0 | 20 0 0 | | |
| రాకింగ్ చేర్ (పట్టుతోసహా) | 80 0 0 | 7 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపుఫోల్డింగు టేబిల్ ( $3X1\frac{3}{4}X2\frac{1}{2}$ ) అడుగులు | 110 0 0 | 10 0 0 | 65 0 0 | 6 0 0 |
| డిటో (నకడ్రాయరు) | 140 0 0 | 12 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపు ఫోల్డింగు స్టూల్ | 28 0 0 | 2 8 0 | 32 0 0 | 3 0 0 |
| ఆఫీసు పాదాకుర్చి | ... | ... | 65 0 0 | 6 0 0 |
| ఆరుకాళ్ల క్యాంపుమంచము | ... | ... | 170 0 0 | 15 0 0 |
| టేబిల్ ($3X2X2\frac{1}{2}$ ) నొకడ్రాయరు | ... | ... | 170 0 0 | 15 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు. | ... | ... | 340 0 0 | 30 0 0 |
| స్టూల్ ($1\frac{1}{4}X\frac{1}{4}$] | ... | ... | 45 0 0 | 4 0 0 |
| బెంచి ($3X^1X1\frac{1}{2}$) అడుగులు | ... | ... | 80 0 0 | 7 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 100 0 0 | 9 0 0 |
| బెంచిసాదా ($6X1X1\frac{1}{2}$) | ... | ... | 130 0 0 | 12 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 170 0 0 | 15 0 0 |
| డ్యాడస్కు నొకడ్రాయరు | ... | ... | 195 0 0 | 18 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు | ... | ... | 340 0 0 | 30 0 0 |
| బ్లాకుబోరుడు ($3\frac{1}{2}XX3$) | ... | ... | 110 0 0 | 10 0 0 |

# విషప్రతివిషమంజరి

అనుభవచికిత్సాదర్పణము, నాడీనక్షత్రమాల, మున్నగు గ్రంథముల ను రచించి జగత్ప్రసిద్ధి గాంచిన లోకిరాజు వసంతపురం మునయ్యగారిచే రచియింపబడినది.

ఈ గ్రంథము మితిమీరిభుజించిన ప్రతివస్తువునకును విరుగులను తేటతెలుగు పద్యములుగా వ్రాయబడినది. అన్నివిధములయిన గడ్డదినుసులు కూరకాయలు, పలువిధములయిన ఫలములు, అన్నిమాంసములు, విషపదార్థములు, యివి యవి యననేల ప్రపంచమున సామాన్యముగ దొరకు అన్ని వస్తువులను పొరపాటున భుజించిన అన్నిటికిని విరుగులను కాపులేని మామిడిచెట్లు కాచుపద్ధతిని ఈగ్రంథమున చక్కగ వ్రాయబడినది.

ఇట్టిగ్రంథము తెలుగుభాషలో దొరుకుటదుర్లభము. ఈగ్రంథము వైద్యులకే గాక అందరకును చాలా ముఖ్యమైనదని మేము ఖండితముగా చెప్పగలము.

ఈగ్రంథరాజము అనేకగొప్పవైద్యులవల్ల ప్రతియింట నుండతగినదని పొగడ్తగాంచినది. ఇందు సుమారు 400 పద్యములుగలవు.

వెల 0. 2—0

# విశ్వనాథవిజయము

అయిదంకముల అద్భుతమైన నాటకము

## గ్రంథకర్త:—భూతపురి నారాయణస్వామిగారు.

విజయనగర సామ్రాజ్యాధీశుల మహోన్నత దశయందు దురాశాపరుడును, తంత్రగాడును అగు తండ్రి నిమిత్తము ప్రహ్లాదునివలె కఠినపరీక్షయందుత్తీర్ణుడై వెలసి, తననిష్కల్మష జీవితమును జాటినయొక యాంధ్ర వీరుని చారిత్రము నాటకరూపమున వ్రాయబడినది. కథాకల్పనము స్వేఛ్ఛపై ప్రకృతిమనోహరముగ చెలిగి అల్లిబిల్లిగ నల్లుకొని పుష్పించి పరిమళము వెదజల్లు తీగవలె కథసాగింపబడినది. ప్రతిపద్యము అమృతరసమొలుకు చుండునని చెప్పిన అతిశయోక్తికాజాలదు. వెల 1—0—0

# అనుభవచికిత్సాదర్పణము.

-o-

రెండవకూర్పు. మంచికాగితములు. సొగసైనఅచ్చు.

ఈగ్రంథమున ఔషధములనుచేయు గుర్తుబయలు పెట్టఁబడియున్నది.

ఏఁబది సంవత్సరములుగ లోకమునందనేక స్థలములందు ఉపయోగింపఁబడి యనేకులను రక్షించిన బ్రహ్మశ్రీ వైద్యపండిత లోకరాజు వసంతపురం మునయ్యగారి, అనుభవములోవాడి గుణమిచ్చిన ఔషధములను కొంచెమయినను మఱుగుపెట్టక బాలురుసయితము నమ్మకముగా యియ్యఁదగిన ఔషధములను జేయు పద్ధతులను వ్రాయఁబడినది.

ఈపుస్తకము సహాయమున ఎంతమాత్రపు ప్రాథమిక వైద్యజ్ఞానము గలవారయినను తమంతటఁదామే ఔషధముల చేసికొనగలరని మానమ్మకము. ఈగ్రంథమునందు సుమారు 500 పుటలు, 1800 చికిత్సలు చేయుటకు చక్కని తేనెలొలుకు తేటతెనుఁగు పద్యములు బాలురకు సయితము అర్థమగునట్లు అచ్చటచ్చట కఠినపదములకు తెలుగు టీకతోసహా వ్రాయఁబడినది. ఈగ్రంథమునందలి చికిత్సలలో నొక్కటియైనను గుణమునిచ్చుటకు దప్పినదని రుజువుచేసిన సొమ్ము వాపసు యియ్యబడును. వెల. 2—8—0

వలయువారు:—

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు,

అని వ్రాయుఁడు.

# శతకద్వయము.

---o---

గ్రంథకర్త నామా వేంకటసుబ్బయ్యశ్రేష్ఠి.

ఆంధ్రవాల్మీకియను బిరుదమును వహించిన మ-రా-శ్రీ వావిలికొలను సుబ్బరావుగారి చంద్రమౌళీశ్వర చెన్నకేశవశతకద్వయమునకు పీఠిక వ్రాసియున్నారు. ఇది భక్తిరస ప్రధానము గల యొక చక్కని పద్యకావ్యము. వెల. 0—8—0

# హనుమత్పంచవింశతి.

సర్వజన సమంజసమైన మనోహరశైలితో ముద్దులమూటఁగట్టు మాటలతో నొప్పారి చదువఁ జదువఁ జవ్వలూరుచు హృదయాకర్షణముఁ జేయుచుండును. కాన ఆంధ్రులెల్లరు పఠించి తీరుదురు. ఇందలి విషయవిశేషములు వేరువేరుగా హెచ్చరించ నవసరము. అభిజ్ఞులు మెచ్చిరి.

వెల.0—0—6

శ్రీయుత నామా వేంకటసుబ్బయ్యశ్రేష్ఠి గారిచే
రచియింపబడినగ్రంథములు.

కామతికందశతకము.
కళావతీవిజయము.
జయప్రదీయము.
అరసికజనవిలాసము.
} త్వరలో వెలువడును.

వలయువారు నీక్రిందిచిరునామాకు వ్రాయుడు.

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

ప్రథమకుసుమము

# గండికోట (గీతము)

ఇది కడపజిల్లా జంబులమడుగు తాలూకా యందలి పెన్నానదీతీరంబునయున్న యొక దుర్గరాజముయొక్క చరిత్రము అప్పటి ఉన్నతస్థితిని యిప్పటి హీనస్థితిని చదివిన ప్రతిహైందవుడును కంటతడి పెట్టకమానడు. నేడే తెప్పించి చదువుడు.

చందాదారులకు ఉచితము    యితరులకు 0-4-0

షరా:— దీనిని ప్రత్యేకముగా పంపుటకు వీలుండదు. గాన యేదేని నొకపుస్తకమును తెప్పించుకొన్నచో దానివెంట పంపెదము. లేదా రు 0-2-0 స్టాంపులుపంపినచో బుక్కుపోస్టుగా పంపెదము

ద్వితీయకుసుమము

# రత్నాబాయి (సాంఘిక నవల)

గ్రంథకర్త బూదూరు రామానుజులు రెడ్డిగారు

చిన్నావ

వర్తమానకాలమున ఆడుబిడ్డలుగల తలిదండ్రులు నామమాత్రముగా మింగివేయుచున్న వరశుల్కముల గురించి తేటతెల్లముగా జెల్పబడినది. వరశుల్కముల వైఖరి ఆడుపిల్లలుగలవారి యవస్థ వివాహములయందలి విరుద్ధములు మోహమందలి మోసము, ముగ్ధులోలుకు చక్కనిమాటలతో నిండియున్నది. ప్రతియింటను ప్రతిహస్తమున నుండితీరవలసిన ఉత్తమాలంకారము. పాఠకుల బరవశ మొందించును. వెల స్వల్పము, ఫలమధికము.

వెల:— చందాదారులకు    రు 0-6-0

యితరులకు    0-8-0

శ్రీ బాలభారతీగ్రంథనిలయము.

చాగలమర్రి

